# పద్మవ్యూహము.





కీ॥ శే॥ మహాకవి

కాళ్లకూరి నారాయణరావు,

గ్రంథకర్త.

# పద్మవ్యూహము

మూడవకూరుపు



చింతామణి, వరవిక్రయ, మధుసేవ,

చిత్రాభ్యుదయాది గ్రంథకర్త

కీ॥ శే॥ మహాకవి

## కాళ్లకూరి నారాయణరాయ

ప్రణీతము.



కాళ్లకూరి భోగరాజుగారిచే

ప్రకటింపఁబడినది.



కాకినాడ

సి[illegible] ముద్రణాలయమున

ముద్రితము.

1930.

 వెల 1 రు. 

# అవతారిక.

ఈ నాటకరచన కీ క్రింది భారతశంకలు ముఖ్యకారణములు:

(1) ద్రోణుఁడు ధర్మరాజును బట్టియిచ్చుటకై పద్మవ్యూహమును బన్నిన ట్లున్నది. ధర్మజునకుఁ దద్భేదనోపాయమె తెలియనప్పు డతఁ డందుఁ బ్రవేశించు ననుకొనుటకుఁ గాని—తన్మూలకముగాఁ బట్టువచ్చు ననుకొనుటకుఁ గాని—యవకాశ మెక్కడిది ?

(2) సైంధవుఁడు తపము చేసి, పశుపతివలనఁ బాండవులను "వారింప" గల్గుటకై వరము వడసిన ట్లున్నది: తలక్రిందుగ నంతతపము చేసినవాఁడు—"వధింపఁ" గోరక—వారింపఁ గోరుట యేటికో?

(3) వరబలమున, సైంధవుఁడు పద్మవ్యూహము చొచ్చు పాండవుల నడ్డఁగలిగిన ట్లున్నది. అగుఁగాక—అట్టి యడ్డంకిలేని విరాట ద్రుపదు లేమయిరి?—మఱి నాఁ డంతకన్న మిన్నయగు వ్యూహము నవలీలగఁ జొచ్చిన సాత్యకి యే మయ్యెను?— కామరూపమున గగనవీథినుండియేని పోఁగల ఘటోత్కచుఁ డే మయ్యెను?

(4) అభిమన్యువధకుఁ బ్రతిక్రియగా నర్జునుఁడు సైంధవుని వధింప శపథము సలిపినట్లున్నది. తన్నచ్చట లేకుండఁ జేసి దారుణవ్యూహము పన్నిన ద్రోణుఁ డుండ—దుర్నయముగ విరథుఁ జేసి మును మూఁడిన కర్ణాదు లుండ—దమ వారిని నిలువరించినంతమాత్రపుఁ బనికి, నెందులకుం గొఱగాని సైంధవుం జంపఁ బ్రతిన పట్టుట యర్జునున కేమి న్యాయము—ఏమి విశేషము?

(5) ద్రోణుని ప్రతిజ్ఞ నాఁడు నెఱవేఱ లేదు—అవ్వల నందులకై యత్నమును లేదు. అంతవానిశపథ మట్లు వ్యర్థము కావలసిన దేనా?

పై శంకలకుఁ బరిహారకముగా నీపద్మవ్యూహము పన్నఁబడినది.

దొరతనమువారి 1919 దవ సంవత్సరపు నివేదికయందు, ఆసంవత్సరము ప్రకటింపఁబడిన యాంధ్రగ్రంథము లన్నిటిలో నీ పద్మవ్యూహ మగ్రగణ్య మయినదిగను - అనేకవిశేషములు కలదిగను శ్లాఘింపఁ బడినది. దీని ప్రథమ ప్రయోగ గౌరవమును శ్రీ శ్రీ శ్రీ విజయనగరము మహారాజావారు దక్కించుకొనిరి. సర్వజన ప్రదర్శన సౌలభ్యముకొఱ కొకయంకము తొలఁగింపఁబడినది.

కాకినాడ,
20-10-22

మహాకవి
కాళ్ళకూరి నారాయణరావు.

Errors, like stars, upon the surface flow ;
He who would search for pearls, must dive below.
Dryden.

---

## పాత్రముల పట్టిక.

| పాండవ పక్షమున - | అంకములలో | కౌరవ పక్షమున - | అంకములలో |
|---|---|---|---|
| 1 కృష్ణుఁడు | 1-5-6 | 1 ద్రోణుఁడు | 2-6 |
| 2 యుధిష్ఠిరుఁడు | 4-5-6 | 2 దుర్యోధనుఁడు | 2-4-6 |
| 3 భీముఁడు | 5-6 | 3 అశ్వత్థామ | 2 |
| 4 అర్జునుఁడు | 1-5-6 | 4 కర్ణుఁడు | 2-4-6 |
| 5 అభిమన్యుఁడు | 3-4 | 5 దుశ్శాసనుఁడు | 2-4 |
| 6 ఘటోత్కచుఁడు | 5-6 | 6 శకుని | 2-4-6 |
| 7 సుమిత్రుఁడు | 3-4 | 7 సైంధవుఁడు | 2-4 |
| 8 విశోకుఁడు | 6 | అన్యులు | |
| 9 ద్రౌపది | 3-5 | 1 సంజయుఁడు | 1-4-6 |
| 10 సుభద్ర | 1-3-5 | 2 వైశంపాయనుఁడు | 1-4-6 |
| 11 ఉత్తర | 5-6 | 3 వృద్ధ (ఒక వీరమాత) | 5 |

సుమిత్రుఁడు - అభిమన్యుని సారథి. విశోకుఁడు - భీముని సారథి.

సంజయ వైశంపాయనులు - వ్యాసులవారి శిష్యులు.

శ్రీ మేధా దక్షిణామూర్తి పరబ్రహ్మణేనమః.

# పద్మవ్యూహము

## నాంది

గరువము వాసి, ధర్మరతి, గౌరవవర్ధకతాపటిష్ఠులై
గురుకృప వైరివర్గము నకుంఠితలీల జయించి, జ్ఞాన వి
స్ఫురణఁ జరించునట్టి నరముఖ్యుల కెప్పుడు వశ్యుఁ డట్టియీ
శ్వరుఁడు దయాసముద్రుఁ డసిశంబుఁగృతార్థులఁ జేయు మిమ్ములన్.

## ప్రస్తావన

సూత్రి—(ప్రవేశించి సభ నుద్దేశించి) ఓ విద్వజ్జన మహాజనులారా! ప్రపంచమునందలి సకల సామ్రాజ్యముల పునాదులను సడల్చి, సర్వ సింహాసనముల నుఱ్ఱూఁత లూఁగఁ జేసిన యైరోపా మహాసంగ్రామమునందుఁ బ్రభుపక్షమునఁ బాలుగొని, ప్రాణవిత్తములను ధారవోసిన భారతవీరుల పరాక్రమ సాహసములకుగర్వపడుచు; నేతత్సంగ్రామశాంతి సంఘటిల్లి యభ్యుదయ మావహిల్లినందులకై యానందింప సమావేశమైన మీవినోదముకొఱకు నేఁడు;విద్యచేత నేకాక, వినయముచేతను-విత్తముచేతనే కాక, వితరణముచేతను-వాక్కుచేతనే కాక, వర్తనముచేతను-వన్నెకెక్కిన శ్రీమద్బుద్ధిరాజు వీరభద్రరాయని కంకితముగా, మహాకవి కాళ్లకూరి నారాయణరాయనిచే రచియింపఁబడిన వీరాద్భుత రసభరితంబగు పద్మవ్యూహ మహానాటకమును బ్రదర్శించి నానేర్చిన భరతాగమము సఫలము చేసికొన నభిలషించుచున్నాఁడఁ గావున సావధాన చిత్త మనుగ్రహింతురుగాక ! (విని) ఏమనుచున్నారు?—

"చ. అనుపమరత్నభూషణము లర్థులు తాల్చినవాఁడె శోభచేఁ
దనరెడుమాడ్కిఁ, గబ్బములు తద్దయు నేర్చిన నర్తకుల్ ప్రద
ర్శన మొనరించునప్పుడె కరంబుఁ బ్రశస్తి వహించుఁ; గాన, న
య్యనఘునిపట్ల మాకుఁగల యాదరముం బొడిగింపఁ జూడుఁడీ"

అనియా?—చిత్తము, చిత్తము. (తెరవంకఁజూచి) పారిపార్శ్వకా!

పారి—(ప్రవేశించి) ఆర్యా! యేమి సెలవు?

సూత్ర—పాత్రములను సిద్ధపఱిచితివా!

పారి—సర్వమును సిద్ధపఱిచితిని; తమయనుజ్ఞయే తడవు.

సూత్ర—సభ్యులయీదేశము వినియె యుందువు కనుకఁ జరిత్రచర్వణ మవసరము లేదు;—నీ వప్రమత్తుఁడవై యుండి భూమికల ధైర్యోత్సాహములను నీప్రోత్సాహముచేతఁ బెంపొందించు చుండుము.

పారి—ఆర్య మీ కట్టిసందియ మెందులకు?

గీ. ఎందు వీరాద్భుతరసంబు లేవు మీఱు
నదియ యుత్తమరూపక; మట్టిదాని
నభినయింపఁగ మీశిష్యులందుఁ బిన్న
వాపఁడును బ్రౌఢునిను మించి పరఁగఁగల్గు.

సూత్ర—అది నిజమే కాని—

ఆ. వె. గాలిచేతఁ దిత్తి, కరతాడనముచేతఁ
గందుకంబుఁ బెంపుఁ గాంచురీతి;
పొంత నిలిచి యొరులు ప్రోత్సాహపఱిచిన
జనుల శక్తి యుక్తు లినుమడించు.

తెరలో—అది యథార్థమె.

గీ. తమ బలంబులఁ బోరిఁగొను తాతఁ జూచి
ఱిచ్చవడి యూరకున్న విర్వచ్చుఁ డల్ల
కంసమర్దను ప్రోత్సాహ కారణమునఁ
దెలివిఁ గని, విల్లుఁగొని, భీష్ముఁ దెగువఁ దాఁకె.

సూత్ర—అదిగో!—నామాటకు నిదర్శన మిప్పుడే కానిపించినది. మనప్రసంగమువల్లనఁ బ్రోత్సాహ మంది సంజయ వైశంపాయన వేషధారులు ప్రవేశించుచున్నారు. మన మిఁక నిష్క్రమింతము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

---

# విష్కంభము

## రంగము—కురుక్షేత్రము.

(సంజయ వైశంపాయనులు ప్రవేశింతురు.)

వైశం—("తమబలంబులఁ బారిగొను" అను వెనుకటిపద్యమును మరలఁ బఠించి) అట్లు తాఁకినబీభత్సుం జూచి భీష్మపితామహుం డిట్లు పలికెను:—

చ. గుఱిమెయి మత్స్యయంత్రమును గూలఁగ నేయుట విన్నదాది సం
గరముఖమందు నీపటిమ గన్గొన వేడుక గల్గియుండి య
వ్విరటునివీటమాత్రి మొకవీసము చూచితి; మంచివీలు చే
కుఱె నిపు, డిన్నినాళ్ళవలెఁ గొంకక చూపుము నీదు పాండితిన్.

సంజ—అందుల కర్జునుఁ డేమనెనో ?

వైశం—ఇట్లనెను:—

చ. ఇరువదియొక్కసారులు మహీతల మెల్ల జయించినట్టి దు
ర్భర బలశాలియైన భృగురాముఁ బరాజితుఁ జేసె నన్న కీ
ర్తిరమ లభించె సర్వజగతీతల నాథులలోన మీకు నొ
క్కరి, కటువంటి మీయెదుట గాండివి యెంతటివాఁడు నిల్వఁగన్.

ఇట్లయ్యిరువు రొకరినొకరు సంభావించుకొని, యగణ్యంబగు ధనుర్విద్యానైపుణ్యంబు మెరయఁ గొంతవడి పోరినమీఁదట, నర్జునుం డొకదివ్యాస్త్రమున సమ్మోహితుఁ డుకాఁగాఁ, బాండవసైన్యంబునందు భయార్భటులును, గౌరవ సైన్యంబునందు జయార్భటులును నొక్కసారిగ బయలు వెడలెను. శ్రీకృష్ణుఁడు మొగము చిన్నబుచ్చుకొని రథము నవ్వలకుఁ దోలికొనిపోయెను. అయ్యవసరమున-

ఆ. వె. తండ్రిపాటు చూచి, తమబలంబుల తొట్రు
పాటు చూచి, మదిని బట్టరాని
యాగ్రహంబు వొడమ నభిమన్యుఁ డానదీ
తనయు మీఁదఁ దాఁకి ధ్వజము త్రుంచె.

అప్పుడు భీష్ముఁడు మున్నిట్టివీరాధివీరులకు నలవి కాని తన తాల ధ్వజము నతఁడవలీలఁ గూలనేసినందుల కాగ్రహానుగ్రహములు రెండును దీపింప నొకయర్ధచంద్రబాణమును వింట సంధించి విడిచెను. అభిమన్యుఁడు దానిని మార్గమధ్యముననె నుగ్గునూచము గావించి, యావృద్ధవీరుని కార్ముకము తుత్తునియలు కావించెను తోడనె గాంగేయుండు కొండొక బాణాసనముం గైకొన, నాతండు దానింగూడ నట్లె కావించెను. ఇట్లు,

ఉ. పట్టినచాపమెల్ల సులభంబుగ భగ్నము సేయ నాత్మలో
బిట్టులుక న్వహించి యలభీష్ముఁడు శక్తి నొకండు వైచి వి
ల్పట్టిన ముష్టిఁ జీల్పుటయుఁ బార్థతనూజుఁడు దాన చాపముం
బట్టఁగ వీలు లేక, యొకవాలు చివాలునఁ దీసె నుగ్రతన్.

కాని, యంతలో నర్జునుని యరద మడ్డు వచ్చినందున నిరుత్సాహుఁడై చికిత్స కనునెపముమీఁద శిబిరమునకుఁ జక్కఁబోయెను. అభిమన్యుఁడు కదనభూమినుండి కదలిపోవుటకుం గలకారణ మిది. శిఖండి విజృంభణము- దేవవ్రతుని శరతల్ప శయనము- గాండీవి పాతాళోదక సమాకర్షణము- మున్నగు తరువాతి యద్భుతచర్య లన్నియు నీవె చూచితివి.

సంజ— తాళు, తాళు !-(వినుట నభినయించును) కృష్ణార్జునుల కంఠ స్వరములు వినవచ్చుచున్నవి -యిట్టివేళ వారెచ్చటికి బయలుదేరి యుందురు చెపుమా !

వైశం— ఇచ్చటనుండియె యాలోచన మెందులకు?-చూతము రమ్ము.

సంజ— ఇద్దఱము నిటే పోయిన నెట్లు?-కౌరవస్కంధావారమున నేమి జరుగుచున్నదో-వారు సైన్యాధిపత్యభారము మరల నెవరితల కెత్తుదురో చూడవలసి యున్నదికదా? నీవిటేఁగుము, నేనటేఁగెదను.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది శుద్ధవిష్కంభము.

# పద్మవ్యూహము



## ప్రథమాంకము

రంగము:—పాండవస్కంధావారము.

[విశ్రాంతివేషములతోఁ గృష్ణార్జునులు ప్రవేశింతురు.]

అర్జు—బావా! రాచపుట్టు వెంతపాడుపుట్టు వయ్యా!

సీ. తండ్రి లేఁడనుమాట తలఁపున బడకుండఁ
ప్రేమతో మమ్మెత్తి పెంచినాఁడు
గురుశిక్షతోఁ దృప్తి కుదురక రణవేద
మును స్వయంబుగ నూరిపోసినాఁడు
ధార్తరాష్ట్రులు మేముఁ దగవు లాడఁగ మా
పక్షమే యెపుడును బల్కినాఁడు
అడవుల కేఁగునాఁ డంబకంటెను ముందు
పొటపొటఁ గన్నీరు పుచ్చినాఁడు
అట్టి ప్రేమ స్వరూపు మహానుభావు
నస్మదీయ పితామహు ననఘుఁ బట్టి
పొట్టనుం బెట్టుకొన్న పాపులకు మాకుఁ
బుట్టగతు లుండఁ బోవునే! కట్ట! యింక.

కృష్ణు—దానికేమి కాని- భగవంతుఁ డీమహామహుం జేసి, యాయ
చ్చు నంతటితోఁ దీసివేసె నని చెప్పందగును.

సీ. వాహనంబు సిడంబుఁ బాగయు శస్త్రంబు
లేనివారల నేయఁ బోనిఘనుఁడు
ఎనసి నూర్వురుయోధు లెత్తివచ్చినఁ గాని
విల్లు చేఁ బట్టని వీరవరుఁడు
తెగువ నిర్వదిమూఁడు దినములు పోరాడి
భార్గవుం గెలిచిన బాహుబలుఁడు

కాశీశు సుతలకై కడఁగి వచ్చినన్నృపా
వళి నొంటినోర్చిన వాఁడిమగఁడు
తండ్రిసౌఖ్యమె కోరిన ధార్మికుండు
బ్రహ్మచర్యంబు నెగ్గిన పావనుండు
చావుఁ దనచేత నిడికొన్న సాధ్వితుండు
కరము మహిమాన్వితుండు గంగాసుతుండు!

(ఇరువురు మౌనముతో ముందునకు నడతురు.)

అర్జు—బావా! నీ వేమన్నను సరియే కాని- యుద్ధము బహువిరుద్ధ కార్య మయ్యా!

ఉ. ఆరయఁ, దండ్రియుఁ దనయుఁడన్న యుఁదమ్ముఁడుఁ, శిష్యుఁడుంగురుం
డీరస మొప్పఁ దారసిలి, యెద్ద వివేకము వీడి, వాఁడిమిన్
ధారణికోసమై పెనఁగి ధారుణిపాలగుకంటె వేఁటుగా
దారుణకర్మ మింకఁ గలదా! వలదా యులదాని రోయఁగన్?

కృష్ణ—పాపము శమించుగాక!- నీకు మరల మతి పోయిన ట్లున్నది యుద్ధ మనఁగా వీరకర్మను- వీరకర్మమును నిందించుట వీరులను స[?]ంచుట కాదా? చూడు,-

సీ. పురహరు[?] కర్బుర శరాసన శింజి
నీరవ మింకఁ జల్లార లేదు
అలశిబి యజ్ఞహయావళి గిట్టల
గుంట లింకను బూడికొంట లేదు
పరశురాముండు తర్పణ మాచరించిన
బావు లింకను నింకిపోవ లేదు
దశరథరామ భూధవుఁడు కట్టిన నీట
కట్టు యింకను వార్ధిఁ గలియ లేదు
వీరుల చరిత్రలీరీతి విశ్వమెల్ల
నిండి సాక్ష్యం బొసఁగుచుండ నీవు వీర

కర్మమున నెగ్గు గలదన్న ధర్మవిదులు
పరిహసింపక విడతురే! పార్థ! నిన్ను.

అర్జు—బావా!. యుద్ధము, క్షామము, ఉప్పెన, భూకంపము, మహామారి, పారతంత్ర్యము, ననునివి యేఁయులు దేశమునకు మహోపద్రవకరములు. అట్టియుద్ధము ధర్మబద్ధ మనుట నాబుద్ధికి నచ్చకున్నది సుమీ!

సీ. బెబ్బులి చొరఁబడ్డ పెనుసంత వంతునఁ
గదలి దేశంబెల్లఁ గలఁత నొందు
దంతి మ్రింగిన కపిత్థంబు చందంబున
సిట్టి కోశంబెల్ల పట్టిపోవుఁ
గార్చిచ్చునం గాలు కానవిధంబున
స్వజనసంతతి వినాశంబు నొందు
సాయంతనపు టింద్రచాపంబు పదువున
మాటిమాటికి సిరి మార్పుఁ జెందు
ఓజ చెడి యొడ్డుపట్టిన యోడ భంగి
దిక్కుమాలి గృహంబులు దిబ్బ లగును;
గటకటా! యెంచి చూడ సంగరముకంటె
ధాత్రిలోపల మఱియనర్థంబుగలదె!

కృష్ణు—ఓయి వెఱ్ఱినాఁడ!—

సీ. పౌరుషంబు త్యజించి బ్రతికి యుండుటకంటెఁ
దొలుదీవివారికి దొసగు కలదె
పూర్వుల విఖ్యాతి బూదిఁ గల్పుటకంటె
నార్యసంతతి కమర్యాద కలదె
ఆయుధ దారిద్ర్య మనుభవించుటకంటె
భారతీయులకు లోపంబు కలదె
ఆత్మగౌరవముపై నాస్థ వీడుటకంటె
హైందవులకు మానహాని కలదె

రాజ్యమెల్లను బరుల కర్పణము చేసి
మగతనము చంపుకొని, కీర్తి మాపుకొని, య
హర్నిశలు పొట్టకొఱకు దాస్య మొనర్చు
కంటె మనజాతి కింకఁ గళంకంబు కలదె ?

అదికాక:—

సీ. సంగరాభావంబు సంఘటిల్లిననాఁడు
క్షాత్రబీజంబు నాశంబు నొందు
దానశస్త్రాస్త్రవిజ్ఞానంబు హరియించు
నవ్వల వ్యాయామ మంతరించు
నామీఁద దేహదార్ఢ్యము సన్నగిల్లును
నటువెన్క రోగము లతిశయిల్లుఁ
బదపడి దుర్బల హృదయులు పరిభవింతు
రంతటఁ బెడబుద్ధు లావహిల్లు;
నదియె మొదలుగ నైకమత్యంబు సెడును
కత్తులుఁ గఠారములుఁ బుటగతము లగును
దేశ మంతటితోఁ దల్పు తెఱచియున్న
యిల్లువోలెను గుక్కల కెక్క యగును !

అర్జు—బావా! అట్లయిన, యుద్ధము ధర్మబద్ధ మనియే నీ నిశ్చితాభిప్రాయమా ?

కృష్ణు—అదిగో! అచ్చటమాత్ర మొకధర్మసూక్ష్మ మున్నది. రాజ్యస్థాపనార్థ మనియు, ధర్మస్థాపనార్థ మనియు యుద్ధము రెండువిధములు. అందు ధర్మస్థాపనార్థ మగుయుద్ధము కేవల ధర్మబద్ధము ఇప్పుడు మీ రొనర్చునది ధర్మస్థాపనార్థమె యగుటఁ జేసి యవశ్యమాచరింపఁ దగినది. ఎట్లందువా ?—

గీ. దశముఖుఁడు సీతనుంబోలె ధార్తరాష్ట్రు
లపహరించిరి మీరాజ్య మక్రమముగ ;
దాశరథి సీతఁగొను చందాన మీరు
శాత్రవులఁ జంపఁదగు స్వరాజ్యంబుఁగొనుట.

అర్జు—(నడచుచు నడచుచుఁ గుడివైపునకు మరలుచు.)

కృష్ణు—అర్జునా! యేమది— యటు మరలితివి?— సుభద్రాదేవి యెందుచేతనో యీపూఁట జ్వరాక్రాంతయై భోజనము సేయక పండుకొన్న దని విని యామెశిబిరమునుగూర్చి కదా బయలు వెడలితిమి ?

అర్జు—అచ్చటి కిది చాలఁ జేరువతోవ. ఈ పాంచాల శిబిరముల యావలివే మనరాణివాసపు గుడారములు.

ఇద్దఱు—(పరిక్రమింతురు.)

కృష్ణు—(ఇరుకెలంకులు పరికించి) ఈదిక్కువారింకను విశ్రమింపలేదు.

సీ. కవచధారణమునఁ గలిగినయుక్కు చ
ల్లారంగ బయట నల్లాడువారు
తమవారియందు శాత్రవులందుఁ బడి మర
ణించినవారి గణించువారు
సలిపివచ్చిన సాహసపుఁ గృత్యములు తమ
ప్రియజనంబులకు విన్పించువారు
మఱునాటిసంగతి మనమున శంకించి
శకునపరీక్షలు సలుపువారు
ఆయుధములు సానల వాఁడి సేయువారు
గాయములకుఁ జికిత్సలు గాంచువారు
నెందుఁ జూచిన నీరీతి నందడిగను
నున్నవా రదె, యీదెస నున్నవారు.

అర్జు—బావా! యీయోధులం జూచినపుడెల్ల నాహృదయము కట కట పడక మానదు సుమీ!

సీ. తనసముదగ్రి సౌధము తక్క నెఱుఁగక
నసవోలె విలసిల్లు నాగరకుఁడు
తనదుక్షేత్రంబు సేద్యము తక్క నెఱుఁగక
శమఁ బాటుపడియెడు జానపదుఁడు
తనయింటిపట్టు సందడి తక్క నెఱుఁగక
సాధువై మెలఁగు వయోధికుండు
తనయాలి బిగికౌఁగిటిని దక్క నెఱుఁగక
యుత్సవాంబుధిఁ దేలు యువజనుండు
పెండ్లికై వచ్చినట్లు సంప్రీతిఁ దరలి
వచ్చి, మానిమిత్తము తమ ప్రాణములను
యుద్ధభువి కప్పనము సేయుచుండ నెట్లు
మానసము నీరు గాకుండ మాను నయ్య.

కృష్ణు—అర్జునా! యోధులు కుంపట్లవంటివారు శాంతిసమయముల యందు వేసఁగికుంపట్లవలె నేమూలనోఁ పడియుండి, యుద్ధసమయ ములయందు శీతకాలపుఁ గుంపట్లవలెఁ గనకనలాడుట వారి ధర్మ ము సరి కాని- నీవనినట్లు శీఘ్రముగానే వచ్చితిమి! అదేకదా సుభద్ర శిబిరము?

అర్జు—అదే. అడుగో! ద్వారపాలకుఁడు మనలఁజూచి, నివేదించుటకై లోపలి కరుగుచున్నాఁడు.

[అంతటఁ దెర యెత్తఁబడఁగా, సుభద్ర శిబిరము గోచరించును.]

సుభ—(శయ్య దిగి) రాచిన్నన్నా రమ్ము!—(అర్జునునివంకఁ జూచి) *బాబును జూచినారా?

అర్జు—చూచుటకై పోతిమి కాని.—యప్పుడే నిద్ర పట్టినట్లు పరిచారకులు చెప్పినందునఁ జూడకయే రావలసి వచ్చినది. వైద్యులు కట్టు కట్టునప్పుడు నీవు దగ్గరనే యుంటివఁటకదా- వారేమి చెప్పిరి?

* అభిమన్యుఁడు.

సుభ—గాయము పూర్తిగా మానువఱకు యుద్ధరంగమునకుఁ బోఁ గూడ దనియు, నీలోపల నతనికి యుద్ధవృత్తాంతము లేమియుఁ దెలియనీయఁ గూడ దనియుఁ జెప్పిరి. (కృష్ణునివంకకుఁ దిరిగి) ఏ మన్నా! నిలుచుండియే యుంటి వేమి?

[కృష్ణార్జునులు కూరుచుండ, సుభద్ర శయ్య నానుకొని నిలుచుండును.]

కృష్ణ—చెల్లెలా యీపూట నీముఖమునందుఁ గానవచ్చు విచారమునకుఁ గారణము బాబు గాయ మేనా?

సుభ—(బలవంతముగా నవ్వి) అన్నా? దానికి విచార మేల?—

క. వీరునకుం బోరునఁ బ్రబల-వీరునిశస్త్రమున సంభవిలు గాయంబు
న్నారీ ఫాలమునకుఁ గ-స్తూరీతిలకంబువోలె శోభయ కాదే?

కృష్ణ—అట్లయిన నేఁటివిచారమునఁ కేదో విశేషకారణమె యుండవలెను.

సుభ—అన్నా! నావిచారమునకుఁ బదుమూఁ డేండ్లు ప్రాయము రాఁగా నేఁటి దనెద వేమి?

కృష్ణ—కురుక్షేత్రమున మీారణభేరి యెప్పుడు మ్రోఁగెనో అప్పటితో దాని కవసానము రానేవచ్చినది కదా?

సుభ—(నిట్టూర్పుతో) అయ్యో! అంతటితో నేమయినది?

గీ. సమరము తుపానుగాడుపు చందమునను
నెప్పు డేగతి మాఱునో యెఱుఁగ రాదు!
దానని జయాపజయములు దైవవశము
లనుచుఁ బెద్దలు వచియింతు రన్న! వినవె?

కృష్ణ—అది యట్టిదే కాని—మన మామెట్లు గడచితిమి.

ఉ. ఎవ్వని నాత్మలోఁ దలఁచి యెల్లపు డేను దలంకుచుందునో
యవ్విలుకాఁడు భీష్ముఁడు రణాంగణముం గయిసేసె నేఁడిఁకన్
గవ్వలగుత్తుల ట్లఖిల కౌరవయోధుల మస్తకంబులం
గవ్వడి భీము లొక్కక్షణ కాలము లోపల డుల్చివేయరే?

సుభ—చిన్నన్నా!

గీ. ఆదినుండియు భీష్ముని యడలు నీకుఁ,
గర్ణు నడలెప్డుఁ బెదబావగారి, కస్త్ర
గురుని యడలు సదా నీదు మఱఁదగారి,
కలజయద్రథు నడ లనయంబు నాకు!

అర్జు—(పరిహాసముతో) ఏమీ! మొన్నఁడుఁ జెప్పవైతివి!—సైంధవుఁడు నీదృష్టిలోఁ గర్ణ భీష్మద్రోణులకన్న మిన్న కాఁగలిగెనుగా!

చ. అడవుల నున్ననాఁడు ద్రుపదాత్మజ యొంటిగ నుంటఁ జూచి యా
జడమతి గొంచుఁ బోవుటయు, జాడలవెంబడి నేగి యాఖలున్
వడముడి కట్టి తెచ్చుటయు, వత్సలుఁ డగ్రజుఁ డాత్మ దుస్సలన్
గడుఁ దలపోసి పుచ్చుటయుఁ, గంజదళాక్షి! యెఱుంగ వేమొకో!

సుభ—ఎఱుఁగ కేమి?—నాభయకారణము దానికి సంబంధించినదే.

క. పరిపరివిధముల నెదఁ ద
త్పరిభవమున కడలి యడలి పలుయత్నములన్
దురమున మిము గెల్వఁగ దు
స్తరమగు సస్త్రం బొకం డతండు గడించెన్.

కృష్ణ—చెల్లెలా! * అలాతపిశాచన్యాయముగా—దానికొఱకు నీ వింతభయపడవలసిన పని లేదు. అది స్తంభనాస్త్రము కాని—మారణాస్త్రము కాదు; మఱియు నొకసారితో దానిపని సరి.

సుభ—అది యట్టిదె కావచ్చును. కాని నాభయమునకు గొప్పకారణ మింకొకటి కలదు. అతని శిర మెవ్వరైన నేలఁ గూల నేసినచో—

కృష్ణ—నేలఁ గూలనేసినఁగదా? త్రిశంకుస్వర్గమునఁ బడ నేయవచ్చును లెమ్మా. ఇంతకు నివి తలఁపునకుఁ దెచ్చికొనియేనా నీవిట్లున్నది?

సుభ—అన్నా! తలఁపునకు నేను దెచ్చికొనలేదు.-దుస్సల తెచ్చినది.

కృష్ణ—చెప్పు, చెప్పు—అదెట్లు?

సుభ—ఉత్తర వేవిళ్ళబాధ చూచి యేమియుఁ బాలుపోక, అత్తగారితోఁ జెప్పిరమ్మని మందారికను బంపితిని. అది మగిడి వచ్చునప్పుడు దుస్సల చూచి—"నీ వెవతె" వని యడుగ "అమ్మా

---

* కొఱవి చూచి దయ్యమనుకొనినట్లు.

సుభద్రాదేవిగారి పరిచారిక" నని యది యుత్తర మొసఁగెనఁట. ఆపాటున ముక్కు మూరెడును మూతి బారెడును జేసికొని "తన మగఁడు నాకొడుకుం జంపి నాకుఁ బుత్త్రశోకము కలిగించినందులకు నీయజమానురాలు పొంగి బోరగిలఁబడుచున్నది కాఁబోలును——! నామగఁడు తనకొడుకుం జంపి నాకూ నటుఁ గలిగింపఁ గలఁ డని యాకులుకులాడితో నాపలుకులుగాఁ జెప్పుము." అని పలికినదఁట!

కృష్ణ——మందారిక యంతమాట విని యూరకవచ్చునది కాదే?

సుభ——రానే లేదు——"అమ్మా! నీమగని మగతన మంత తెలిసిన దే కాని——నేఁ బోయి యీమాట చెప్పిన నీకుఁ బుత్త్రశోకమునకుఁ దోడు భర్తృశోకముకూడ సంప్రాప్త మగునేమో యాలోచించు కొనుము." అని మఱి చక్కవచ్చినదఁట.

అర్జు——సరియే——అనవలసినమాట యేమో మందారిక యననే యన్నది; దానినే నేను స్థిరసఱిచెదను:——

చ. వల దని ధర్మనందనుఁడు వారణ సేయ వధింపమాని యు
య్యాలఘుబలుండు భీముఁడు జయద్రథు లజ్జ హరించె నాఁడు; తొ
య్యలి! యల * సింధురాణ్మహిషి♦ యైదువరాలితనంబు నీమనం
బెలరుప రేపొ మాపొ హరియించెద నే నికఁ నూరడిల్లుమా!

కృష్ణ——అమ్మాయి! వింటివిగదా మీయాయనప్రతిజ్ఞ?— సైంధవు నిపూఁటతో లేనివానిఁగా నిశ్చయించుకొని, పోయి భోజనముచేసి విశ్రమింపుఁడు. అర్జునా! దుర్యోధనుఁడు సర్వసేనాధిపత్యమును గూర్చి యాలోచించుటకు రాజుల నందఱను సభాశిబిరమునకు రప్పించు సన్నాహములో నున్నాఁ డని మనగూఢచారులు వచ్చి చెప్పిరికదా?_పైసంగతి యేమిజరిగినదో పోయి తెలిసికొందము రమ్ము (అందఱు నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము.



---

* ముస్సల ♦ సువాసినీత్వము.

# పద్మవ్యూహము



## ద్వితీయాంకము

రంగము:— కౌరవ స్కంధావారము.

[శకుని దుర్యోధనులు విశ్రాంతి వేషములతోఁ బ్రవేశింతురు.]

శకు— సరి కాని— యెక్కడి కిప్పుడు మన ప్రయాణము ?

దుర్యో— ఆచెట్టుక్రిందికి. ప్రత్యేకము నీతో నొకసంగతి మాట్లాడ గోరి, యందుల కది యర్హస్థల మని తీసికొని వచ్చినాఁడను.

శకు— నీవు మాట్లాడఁ గోరినసంగతి సేనాధిపత్యమును గూర్చి నై యుండవలెను.

దుర్యో— మామా ! పరేంగిత జ్ఞానమునందు నిన్ను మించినవా రెవ రున్నారు ! అందువలననే నీతోఁ జెప్పక యేకార్యమునందును బ్రవేశింపను.

శకు— గమ్యస్థానము చేరినారము. ఇఁక నీవు చెప్పఁదలఁచిన దేమో చెప్పుము.

దుర్యో— మామా ! చెప్పుట కేమున్నది ?— సేనాధిపత్యమును గూర్చి *దధిపిష్టీన్యాయముగా నా కేమియుఁ బాలుపోవుటలేదు.

చ. గురుఁ డఖిలాస్త్ర కోవిదుఁ, డకుంఠిత విక్రముఁ, డాజిలో సురా
సురులకుఁ గూడ దుర్జయుఁడు ; సూతసుతుండును నట్టివాఁడె;యీ
యిరువురిలోన సైన్యముల కెల్ల నధీశ్వరుగా నొనర్ప ని
వ్వరు తగువారలో యని యవారిగ నామది శంకఁ బొందెడున్.

ఇంకొకటి—

గీ. గురునియెడ నెల్లవారికి గురియు, కాని—
పార్థునెడ నాయన విశేషపక్షపాతి ;
కర్ణుఁడలపార్థు నెడలఁ గర్కశుఁడె, కాని—
యతనియెడఁ గొందఱకుఁ గిట్ట దాత్మయందు.

---

* పెరుగు పిండి కలిసినట్లుగా.

అది యటుండనిచ్చి, కర్ణున కాధిపత్య మిచ్చితి మనుకొనుము,

ఉ. ధనురాచార్యుని నన్ను నల్పునిగ స్వాంతంబందు భావించి యా
తని కర్పించెఁ జమూపతిత్వ మని రోషంబెందు ద్రోణుం డెడన్;
ఆతనిం గాదని యాచార్యున కిచ్చిన,—
తనకై ప్రాణము లొడ్డి యర్జునుని దోర్దర్పం బడంపంగ నెం
చిననన్నుం జినచూపు చూచె నని రోషించు న్మది న్గర్ణుడున్.

కాబట్టి,వ్యవహార మిదమిద్ధ మని నిర్ణయించుటకు వలనుపడక ముందునకు వచ్చిన గోయి, వెనుకకుఁ బోయిన నూయి—యను సామెతకుఁ దార్కాణముగా నున్నది. ఈలాంటి విషమస్థితియందు నీబుద్ధి నడచిన ట్లితరబుద్ధియు నడవదు. కావునఁ, గర్తవ్యము * నిర్ధరించి నాయాందోళనము నివారింపుము.

శకు—సేనాధిపత్యమునమాట తరువాత నాలోచింతము కాని—నీ కింకను యుద్ధము సాగింపవలె ననియే యున్నదా ?

దుర్యో—(ఆశ్చర్యముతో) ఏమి మామ ! అట్లడిగితివి !

శకు—ఏమా ?

క. కడుబల్లిదుఁ డగుభీష్ముని-బడ నేసినవారి కింకఁ బరు లధికులొకో!
గుడి మ్రింగినవారలక-ప్పడము లెకాతలుపు లనఁగఁ బార్థివముఖ్యా!
మఱియు,

చ. కలన నదీతనూభవు శిఖండి శరావలి నొంచి రక్తధా
రలు వెడలించుచుండ ; గుణరావముతో విశిఖాళి రెండుచే
తుల నిగిడించి యాఁగలను దోలినయట్లు కిరీటి తూల్చె దో
ర్బలసన మొప్ప నేడు మనవీరుల ; వారి జయించు టెట్లొకొ ?

దుర్యో—(అనిష్టముతో) మామా ! నాముందు వారిప్రతాపవర్ణన మెందులకు గాని— యింతకు వచ్చినతరువాత సంధి చేసికొమ్మనియెదవా ?

శకు—(చిరాకుతో) పాడుసంధి !—సంధిమాట యెత్తినవా రెవ్వరు?

దుర్యో—మఱి ?—

---

* నిర్ణయించి.

శకు—మఱి మార్గమే లేదా?—ఆగర్భ శత్రువుల నడంచుటకు యుద్ధమె కావలెనా?

దుర్యో—(ఆశతో) అట్లయిన, నీవు పృథా ప్రయాస మంతయు నెందులకు? అదే చెప్పుము.

శకు—చెప్పెడి దేమిటి?—

గీ. నచ్చు బాటుగ మన కచ్చివచ్చినట్టి
పాచికలు చల్లఁగా నుండఁ బవర మేల
అధిప! నేను సృజించిన యక్షములకుఁ
గలదె తిరు గింక మూఁడులోకముల యందు?

దుర్యో—(వికాసముతో) మామా! యీమాట నామనసునందును నున్నదే కాని—యందుల కవకాశ మబ్బుట యసంభవ మని పయికిఁ దేల లేదు.

శకు—అనగా—•నాద్యూతప్రియుఁ డొంటరిగా నెట్లు దొరకు నని యేనా?—అందుల కిదియే తగిన యదను.

ఉ. దిట్టతనంబు మీఱఁగ యుధిష్ఠిరు నెవ్వరు పట్టి తెత్తురో
యట్టి యవక్రవిక్రముల కంచిత సర్వబలాధిపత్యపుం
బట్టము గట్టువాఁడ నని పల్కుము నిండుసభాంతరంబునం,
బెట్టగ నీతలంపు నెఱవేఱును దప్పక కౌరవేశ్వరా!

దుర్యో—(ఉత్సాహముతో) సెబాస్! మామా! సెబాస్!—
* ఏకక్రియా ద్వ్యర్థకరీ బభూవ యనునట్లు—నీయాలోచన ముభయతారకముగా నున్నది!

గీ. స్వామికృపచేత నీయెత్తు సాగెనేని
కడఁగి యీసారి నూఱేండ్లు కానలందు
వాస మొనరింపఁ బందెము వయిచి, వార
లూరిమొగ మెన్నఁడిక జూడకుండఁ జేతు.

శకు—ఈసరికి రాజు లందఱు సభాశిబిరము చేరి నీకొఱకు నిరీక్షించుచుందురు, పోయి ముందుపని చూతము రమ్ము.

• ధర్మరాజు * ఒకపనివలన రెండుప్రయోజనములు.

ఇద్దఱు --(మరల వెనుకకు నడతురు.)

(అంతటఁ దెర యెత్తబడఁగా—కృపాశ్వత్థామ దుశ్శాసన సైంధ
వప్రభృతులు కోలాహలముతోఁ బ్రవేశింతురు.)

దుర్యో—(సత్వరముగ సమీపించి) దుశ్శాసనా కర్ణుఁడు రాలేదా

దుశ్శా—వచ్చి, నీవు లేవని కాఁబోలును, తాతగారిని జూచివత్తు నని చెప్పి యేఁగినాఁడు. (వినుట నభినయించి) అదిగో బండిచప్పుడు? మాటలోనే వచ్చినాఁడు.

అశ్వ—(కృపునితో రహస్యముగా)మామా! చూచితివా మహారాజు పక్షపాతము? ఇతనికిఁ గర్ణుఁ డొక్కఁడే వెలితిగఁ దోఁచెను

కృపు—(రహస్యముగానే) అబ్బాయీ! యిదివఱ కతఁడు యుద్ధము నందు లేఁడు కదా? అందువలన నతనింగూర్చి ముందు విచారిం చుటలోఁ దప్పేమియు లేదు.

(అంతటఁ గర్ణుఁడు ప్రవేశించును.)

దుర్యో—(కర్ణున కెదు రేఁగి) మిత్రమా యెచ్చటి కేఁగితివి?

కర్ణు—నేనా?

గీ. ఎవరికతమున నీపది దివసములును
దాల్పనైతినో శస్త్రము తాతగారి
పొంత సమరంబున కనుజ్ఞఁ బొందుకొఱకు
వసుమతీశ్వర! నేఁ బోయి వచ్చినాఁడ.

దుర్యో—ఈలాటిమర్యాదలు నీసొమ్ము. సరి కాని. సర్వసేనాధిపత్య మునుగూర్చి యేమి యాలోచించితివి.

కర్ణు—ఆలోచన కేమున్నది? మనసేనాను లందఱుఁ *సేనానులేకదా!

దుర్యో—అదే వచ్చినచిక్కు—అందువల్లనే యేమియుఁ బాలుపోక, నీయిష్టపడినచో నొకదారి త్రొక్కుటకు నిశ్చయించుకొన్నాఁడను.

కర్ణు—మహారాజా! యేవిషయమునందుఁ గాని నాయిష్టముకొఱ కెన్నఁడు నెదురుచూడ వలదు సర్వత్ర నీయిష్టమే నాయిష్టము.

* కుమారస్వామి

దుర్యో—అట్లయిన రమ్ము. (కర్ణుని చేయి పట్టుకొని కొలువుకూటము నకు వచ్చి కృపునివంకఁ జూచి) ఆర్య! ఆచార్యులవారేరి ?

కృపు—మహారాజ! వైద్యులలుగులం దీయుట పూర్తి కానందున నీవు కొలువుకూటమునకు రాఁగనే వర్తమాన మంపవలసిన దని చెప్పి ముందు మమ్ములం బంపినారు.

దుర్యో—దుశ్శాసనా! సత్వరముగ బండి తీసికొనిపోయి యాచార్యులవారిని దోడుకొనిరమ్ము.

దుశ్శా—(నిష్క్రమించును)

దుర్యో—(సైంధవునుద్దేశించి) బావా! కడమవారందఱు వచ్చినట్లేనా!

సైంధ—అందఱు వచ్చి, యిక్కడ నుక్కగా నున్నందున నరుగో! పార్శ్వభాగములయందలి చవికలలోఁ గూర్చున్నారు.

దుర్యో—(కలయం జూచి) లేవకుఁడు, లేవకుఁడు,-ఇప్పుడు డట్టిమర్యాద లవసరము లేదు. (కర్ణునివంకఁ దిరిగి) అన్న ట్లడుగమఱచితిని. [1] భవితవ్యమును గూర్చి తాతగా రేమయిన సెలవిచ్చినారా?

కర్ణ—కోటి సెలవిచ్చినారు. అన్నిటియొక్కయు సారాంశము- సంధి చేసికొనటయే శ్రేయస్కర మని.

దుర్యో—(వికటముగా నవ్వి) సుయోధనుని కంఠమునఁ బ్రాణ ముండగాఁ నది యెన్నఁడుఁ బొసఁగనేర దని చెప్పక పోయితివా ?

కర్ణ—అట్లు చెప్పలేదు కాని—కర్ణుని కంఠమునఁ బ్రాణ ముండఁగా నది పొసఁగనేర దనిమాత్రము చెప్పితిని.

అశ్వ—(వికటముగా) మే లంగరాజా!-మేలు! యథార్థము చెప్పితివి! సంధియెడ నీకు మొదటనుండియు సవతితల్లి ప్రేమయే గదా!

కర్ణ—నాకే కాదు-నీకును, నీతండ్రికిని, నీమామకును దక్కఁ, గడమ యందఱకును గూడ నట్లే. కారణము తెలియునా ?-

గీ. భీరు లెప్పుడు సంధియే కోరుచుంద్రు
[2] విగ్రహామె కోరుచుందురు వీరు లెపుడు ;

---

1 ముందరిసంగతి 2 యుద్ధము

అశ్వ — అట్లుకాదు —

ఎపుడు నీచులు కలహమే యిచ్ఛగింతురు
సంధియే యిచ్ఛగింతురు సాధు లెపుడు.

అని శాస్త్రము.

కర్ణు — (రోషముతో) ఆలా గేమి ? —

చ. అవనిపు సుప్పుగల్లు దిను వాతని శత్రుల మేలు గోరి రే
పవ లిటు సంధికై పలవువారలె నీచులొ — రాజుకోసమై
బవరమునందు ముందుఁ దమప్రాణము లర్పణ సేయఁజూచు వీ
రవరులె నీచులో యడుగరాదె సభంగల పిన్న పెద్దలన్ ?

కృపా — అబ్బాయి ! పాకము ముదురుచున్న దిఁక విరమింపుము.

అశ్వ — (వినిపించుకొనకయే) ఓహో! లజ్జాదేవి యీతని నెంతవిచ్చల విడిగా విడిచిపెట్టినది ! రణరంగమునకు ముం దడుగు వేసి, రాజు నిమిత్తము ప్రాణము లొడ్డు మేము శత్రులమేలుగోరు కృతఘ్నుల మఁట ! — యేదో వంక నాధారము చేసికొని యింతవఱకు నింట గూరుచుండి — * ఉలూఖల శేషన్యాయముగా-నిపుడు సిద్ధపడిన తాను రాజుకొఱకుఁ బ్రాణము లర్పించు పరమభక్తుఁడఁట !

ఉ. దండిసుగండు భీముఁ డతిదర్ప మెలర్పఁగఁ ద్రిప్పి పెన్గదా
దండము వీచినప్పుడును; దత్తనయుండు ఘటోత్కచుండు కో
దండము త్రుంచి తేరిసయుతంబుగ మీఁదికి నెత్తినప్పుడున్
దండను నెవ్వరుంటఁ బతి దక్కఁనొ సభ్యు లెఱుంగ కుండిరే !

కర్ణు — మహారాజా ! వింటివా యీ మెత్తి పోడుపు ! — దండువెనుక నిలచి యాశీర్వచనపనసచెప్పవలసినవారికి, విల్లమ్ములు చేతికిచ్చి వీరవేషము వేయించిన నేమనుటకు సాహసింపరు !

అశ్వ — ఇది రెండవ తప్పు ! — స్తోత్రపాఠములు చదువుటకు దండు వెనుక నుండువృత్తి సూతుఁడగు నీది కాని నాది — కాదు.

దుర్యో — మిత్రమా ! కృపాచార్యులవా రన్నట్లు పాకము ముదిరి పోవుచున్నది-నీవైన నింతట విరమింపుము.

* అల్లుఁడు అత్తగారు పెట్టినప్పుడు చిమ్మిలి తినక, రహస్యముగా రోలునాకినట్లు.

కర్ణు—(వినిపించుకొనకయే) అది యట్లే కావచ్చును; కాని—

గీ. యజనములయందు శ్రాద్ధములందుఁ దేర
కూళ్ళతోఁ బొట్టలను నించికొనుచుఁ, జిలుక
పలుకులం జీవనము పుచ్చు బోఁప లేమి
ఘనులు సూతులకంటె లోకంబునందు ?

అశ్వ—"వినాశకాలే విపరీతబుద్ధి" యనునట్లు, చివరకు నీ కీబుద్ధి కూడఁ బుట్టినదా !

క. బ్రాహ్మణవేషముఁ దాలిచి,
బ్రాహ్మణసన్నిధిని విద్యలం బడసి, చివరకుం
బ్రాహ్మణనింద యొనర్చెదు
బ్రహ్మద్వేషంబు చిచ్చువంటిది సూవే !

మ. అతిపాతంబుగ హైహయాధముఁడు బ్రహ్మద్వేషముం బూని భూ
స్థిత రాజన్యకులంబు లన్నిటికిఁ దెచ్చె న్మూలవిచ్ఛిత్తి; దు
ర్మతి ! నీ విప్పు డకారణంబుగను బ్రహ్మద్వేషివై దుర్మదో
ద్ధతిఁ గల్పింపఁగఁ బోకు సూతకులవిధ్వంసంబు నీపేరిటన్.

కృపా—అబ్బాయి ! అతనితో నేమి?—జగత్పూజ్యులగు నగ్రజన్ముల యౌన్నత్య మెవ్వ రెఱుఁగరు ?

కర్ణు—ఆహా !—యెఱుఁగ కేమి ?

ఉ. లోకుల వాకిళుల్ పవళులు న్నిశలుం బొడిగాఁగ మెట్టుచు
న్నాకొను చిచ్చకంబులు తృణంబున కేవియుఁ జేయి చాచుచున్
మాకుఁ జిరాయురున్నతులు, మాకు శుభంబు, సుఖంబు మాకటం
చేఁకలు బ్రాహ్మణాధముల నెవ్వ రెఱుంగనివారు ధారణిన్.

అశ్వ—ఓరీ, వీరంమన్యా ! * అలాబూ పాషాణ న్యాయముగా— నీపుట్టువునకుఁ దగినట్లే పలికితివి ! చూడు—

మ. పాను పోవ్వ న్మను దస్యులం గెలిచి జంబూద్వీప మాద్యంతమా
ర్జనముం జేసిన దెవ్వ?—రాగమములున్ శాస్త్రేతిహాసంబులున్

* జాతిలోఁ బుట్టిన సొరకాయ జాతినెతియ యెట్లుండునో యట్లే పెరుగునట్లు

దనరం గల్పన సల్పి జ్ఞానమును బోధిద్యల్లీల వ్యాపింపఁ జే
సినవారెవ్వరు? బ్రాహ్మణోత్తములె కా? చింతింప మూఢాత్మకా!
ఇంకను జెప్పుమనెదవా?

సీ. ఆదికాలమున నార్యావర్త మెల్లను
బాలించిన [1] మనువు బ్రాహ్మణుండు
ధరణీతలంబెల్లఁ దనదిగాఁ గన్న త
తస్వి కశ్యపుఁడును బ్రాహ్మణుండు
[2] శక్రునిచేత ముజ్జగము లేలించు నే
ర్పరి బృహస్పతియును బ్రాహ్మణుండు
క్షత్రిజాతి నిరంకుశత్వ మడంచిన
పరశురాముండును బ్రాహ్మణుండు
పృథివిపులకెల్ల విలువిద్దె బిచ్చ మిడిన
ప్రథితయశుఁడు నాతండ్రియు బ్రాహ్మణుండు;
ప్రాకటంబగు బ్రాహ్మణ ప్రాభవమున
కింతకంటె నిదర్శన మేమి వలయు?

కృపా—అబ్బాయి! అతనితో పాటు నీకుఁ గూడ మతి పోయినదా
యేమి అన్నికంఠము లొక్కకంఠమ్మై, యన్ని చేతు లొక్క
చేయిగాఁ బని చేసి, యాత్మగౌరవము కాపాడుకొనవలసిన యిటు
వంటి విషమస్థితియం దన్నిటికిని హానికరమైన యీబ్రాహ్మణా
బ్రాహ్మణ వివాద మేమిటి! అదికాక—మానవసంఘ మొక
వృక్షము వంటిది:—

సీ. బ్రాహ్మణుల్ [3] మూలంబు భంగి విజ్ఞానజీ
వనము సర్వత్ర వ్యాపనము సేయ
క్షత్రియుల్ [4] స్కంధంబు చాడ్పున సకలభా
రంబోర్పునం ధారణం బొనర్ప
వైశ్యులు [5] శాఖల వడువున దిశ లంటఁ
బ్రేకి దారిద్ర్యాతపం బడంప

1 స్వాయంభువుఁడు, 2 దేవేంద్రుఁడు. 3 వేరు. 4 మొదలు. 5 కొమ్మలు.

శూద్రులు [1] త్వచమట్లు సుఱ్ఱుక్కుచు నెండవా
నలఁ బరసంరక్షణంబు సలుప
మహిత మానవ సంఘు [2] దుర్మఁబు భువన
సందనంబున కెల్లను నంద మగుచు
నలచతుర్విధ పురుషార్థ ఫలసమృద్ధిఁ
గాంచుఁ; గొఱవడెనేని నశించు నిజము।

అశ్వ—అట్లయిన, మామా। యిఁక నే నిట్టిప్రసంగము సలిపి యిత రుల కవమానవ్యధ కలిగింపను. కాని—

గీ. శంతనుతనూజుఁ డనిఁ గూలునంతవఱకు
శస్త్రము త్యజింప శపథము సలిపె నితఁడు;
ఇతఁడు తెగునంతవఱకు నే నిదె మదీయ
శస్త్రము త్యజించుచుంటి నిశ్చయముగాను:
(అని ఖడ్గమును విడుచును.)

కర్ణు—[3] అంధకరదీపికాన్యాయముగా-నీవంటివాఁడు శస్త్రము ధరించి నను, త్యజించినను గూడ సమానమే!

అశ్వ—వింటివా మామా! యీతుంటరి వాఁగుడు!—ఓరీ! రథ కారకుల కలంకా! రాధా గర్భ భారభూతా!

గీ. శస్త్ర ముడిగితి నని సాహసంబు వలదు
ముష్టియే చాలుఁ జుమి నిను మోది చంప
ముష్టియుఁ గూడ నేల నీమూర్ధ మిదిగో!
కాలఁ జిదుపవలు గావింతుఁ గాచికొనుము!
(అని తన్నఁ బోవును.)

కృపా—(అడ్డుకొని) వత్సా! వత్సా! వీనిమాట లేమి లెక్క?— రాజు మొగము చూడుము. (అని వెనుకకుఁ దీసికొనిపోవును)

కర్ణు—(ఆగ్రహముతో) ఓరీ! వాగాడంబరా! కుక్షింభరా?

గీ. అరయఁ బిచ్చుకమీఁద బ్రహ్మాస్త్ర మనుచు
నైచినకొలంది నీసాహసంబు హెచ్చె,

1 పట్టు. 2 [illegible]

రమ్ము నీకండలం జెక్కి రాపులుంగు
గమికి సంతర్పణ మొనర్తుఁ గాక మూర్ఖ ?

(అని ముందున కుఱుకును.)

దుర్యో—(పట్టుకొని) మిత్రమా ! యేమి యన్యాయ మిది! మనలో మన మిట్లు తగవు లాడుకొనిన శత్రువులు పరిహసింపరా ?—

అశ్వ—(అపవారించుచు) మహారాజా ! * ఉద్ఘాటదంష్ట్రి భుజగన్యాయముగా—బ్రతుకు వీని నీవింకను నెందులకు రక్షింపఁ జూచెదవు?—

ఉ. వీఁడె కతంబు పోరునకు, వీఁడె సుమీ శనిగాఁడు నీకు నీ
తోడి సమస్తయోధులకుఁ, దుంపెసలాడక మాననంబునన్
వీడుము వీనిపై నెనరు, వీడుము నాకెడగల్గ, నేటితో
మూఁడెను వీని కాయు వికఁ బోలదు సైపఁగ నుంతయేనియున్.

కర్ణ—మహారాజా యితని దుష్ప్రలాపములకు నాయొడలు మండిపోవుచున్నది— వీనిరక్తమునందు మజ్జన మాడినఁ గాని యిది చల్లఁ బడదు. విడువుము— నన్నిఁక విడిచిపెట్టుము (అని పట్టు వదల్చుకొనును.)

దుర్యో—(మరల నడ్డుకొని) అదిగో బందిచప్పుడు—ఆచార్యులవారు వచ్చుచున్నారు —

కర్ణ—(అంతలో నపవారించి) రానిమ్ము —ఆయన కెవరు శిష్యులో వారు భయపడుదురు

చ. గిరిసుత తల్లివోలెఁ దిలకింప, శరాసన వేద మర్మముల్
పురహరు సన్నిధానమునఁ బూర్తిగ నేర్చి, పరీక్షయిచ్చి, యా
హరుని కటాక్షమాలికయు, నాయన గొడ్డలియుం గడించి సు
స్థిరయశుఁడైన భార్గవుని శిష్యుఁడు కర్ణుఁడు నీ వెఱుఁగవే?

అశ్వ—చెట్టుపేరు చెప్పి కాయ లమ్ముకొనుట యనఁగా నిదియే !

గీ. తెలిసి, సలిపిన మోసము తెలిపినట్టి
విద్య వ్యర్థము గాఁగ శపించి వెడలఁ

* కోఱలు తీయఁబడినపాము పైకి భయంకరముగఁ గాన్పించుటయే కాని-కఱవనేరదు

గొట్టిన న్నిగ్గు విడిచి యాగురుని పేరె
చెప్పికొని యిందు మర్యాదఁ జెందఁజూచు

కృపా—హుష్ కట్టుకట్టు కనఁబడుటలేదా ?- (అని వచ్చుచున్న ద్రోణుని సూచించును.)

(అంతట దుశ్శాసన ద్రోణులు సత్వరముగఁ బ్రవేశింతురు.)

ద్రోణు—మహారాజా నాయాలస్యమును మన్నింతువు గాక. (పార్శ్వములకుఁ దిరిగి) సభ్యులారా మీకందఱకు శ్రమ కలిగించి నందులకుఁ జింతిల్లుచున్నాఁడను. (కర్ణుని వంకఁ జూచి) ఏమిది యంగరాజు మొగము కోపరసమునఁ దేలియాడుచున్నది (అశ్వత్థామవంకఁ జూచి) సరి — నాయాలస్యమునకు నేను జింతింపవలసిన పనిలేదు! అంగరాజును మావాఁడును గలిసి సభ్యుల కేదో వినోదము గలుగఁ జేయుచునే యున్నవారు (రాజువంకకుఁ దిరిగి) మహారాజా! కర్తవ్య మేమి?

దుర్యో—సర్వసేనానాయక నిర్ణయమే

ద్రోణు—దానికిఁ బెద్ద యాలోచన మెందులకు ?- నీకుఁ దోఁచినవారి నొక్కరిని నీవే పేర్కొనుము.

దుర్యో—ఆభారము నాపైఁ బెట్టికొనుట నాకిష్టము లేదు.

ద్రోణు—మఱి యెట్లు సేయ నెంచితివి ?

దుర్యో—ఇట్లు; —(అని సభవంకకుఁ దిరిగి) ఓసభాస్తారులారా

గీ. ప్రాణములతోడ నెవ్వరు పాండవాగ్రి
జన్ముఁ గొనితెచ్చి యర్పింప శపథ మాచ
రింపనేర్తురో లెందు వారికి సమస్త
వాహినీనాయకత్వ మర్పణ మొనర్తు.

(అని కర్ణునివంకఁ జూచును.)

కర్ణు—(గర్వముతో) మహారాజా నావంకఁ జూచెద వేమి ?

మ. ధనురాచార్యుఁడ నంచుఁ బేరుఁ గొని యత్యంతంబు నీచేత మ
న్ననలం గాంచెను ద్రోణుఁడుండ-మఱి యెన్నక్రాని శూరుండుత

త్తనయుం డుండ నిఁకేల మాద్భశులుచేత న్వాతఁ గానట్టివా
రనుమానింపక యిందుఁ జూపు మనవయ్యా! వారిసామర్థ్యముల్.

ద్రోణు—(తిరస్కారముతో) అంగరాజా! [1] కరభదోహనన్యాయముగా- ఈభారము నీతలకెత్తుట యయుక్తమే. అర్జునుని నీకు పంతువేసి మహారాజు నీపైఁ గొండంత యాస పెట్టుకొని యున్నాఁడు. అదిమాత్రము నిర్వహించి యతనిముద్దు చెల్లించితివా-చాలును. (దుర్యోధనునివంకకుఁ దిరిగి) మహారాజా! యీ సందర్భమున నిన్నొకటి యడుగవలసి యున్నది; యెవ్వరో యొకరు పాండవాగ్రజుం బట్టి యర్పింతు రనుకొనుము- అప్పుడు నీ వతని నేమి చేయుదువు?

దుర్యో—మీయభిప్రాయము తెలిసినది-చేఁజిక్కిన వానిం జంపునంతటి యక్రమమునకు సుయోధనుఁడు పాల్పడునని యెన్నఁడును శంకింప వలదు.

ద్రోణు—అట్లయినచో,—

చ. సురగణ మెల్లఁ గోటవలెఁ జుట్టును గ్రమ్మిన గ్రమ్ముఁగాక! శం
కరుఁడు స్వయంబుగా వెసలి కావఁగ వచ్చిన వచ్చుఁగాక! భూ
వర! విను మస్మదీయ భుజపాటవముం గని మీరలెల్ల ర
చ్చ్చెరువుపడన్ యుధిష్ఠిరుని జీవముతోడనె పట్టియిచ్చెదన్.

(తెరలోఁ గలకలము.)

దుర్యో—ఆచార్యోత్తమా! మీశపథము విని సభ్యు లందఱు జయజయధ్వానములు సేయుచున్నారు. అభిషేకద్రవ్యము లాచవికలో సిద్ధము సేయఁబడి యున్నవి. దయచేసి, [2] పట్టము ధరింపుఁడు.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది మహాకవి కొఱ్ఱపాటి నారాయణరాయ విరచితంబగు

పద్మవ్యూహ మహానాటకమున

ద్వితీయాంకము.

---

1 అవుండఁగా గాడిదపాలు పితికినట్లు. 2 అభిషేకకాలమున నొసట గట్టు పట్టె.

## విష్కంభము.

సుమిత్రుఁడు——(ప్రవేశించి) పసిబిడ్డముద్దే ముద్దు—పనిముద్దే ముద్దు మూఁడుదినములనుండి బాబుగారు శిబిరమునందే యుండవలసి వచ్చుటంజేసి— "ముంజేయి యాడిన మోచేయి యాడు" నను సామెతగా——ఆయనసారథి నగు నేనును బనికి మొగమువాచి గోళ్ళు గిల్లుకొనుచుఁ నింటఁ గూర్చుండవలసినవాఁడనైతిని! (పరిక్రమించి) చిన్నదొరగారు నిన్న భగదత్తుం ద్రుంచినప్పుడును, గర్ణనొంచినప్పుడును జూపిన ప్రతాపమును గన్నులారఁ గాంచఁగలిగిన నాతోడివారి యదృష్టమే యదృష్టము! నేఁడు తెల్లవారుసరికి వినవచ్చిన కింవదంతి నిజమగునెడలఁ గౌరవులకు నిన్నఁ గలిగిన పరాభవమే యందులకుఁ గారణమై యుండవలెను, కాని, మొన్నను నిన్నను లేనిది నేఁడట్టి యుధిష్ఠిరమహారాజుగారిం బట్టఁగలుగుటకు ఆచార్యునకుఁ గ్రొత్తగా వచ్చిన కొమ్ములేమిటి! (వినుట నభినయించి) ఆ మహాకలకల మేమయి యుండును జెపుమా (ప్రక్కకుజూచి) భేరిపాఱవేసిన గజ్జెమువలె వచ్చు నీతఁడెవ్వఁడై యుండును! (పరికించి) ఓహో! అఁడంగులకు యుద్ధవార్తలు నివేదించు జంఘాలికుఁడా!——భద్రా! ఆకలకల మేమి?——ఓరి పొగరుబోతా! నోరు విప్పిన నోటిలోని ముత్తెములు రాలిపోవు ననియా పలుకకుండనే పరుగిడుచున్నాఁడవు? పోనిమ్ము, బాబుగారి స్థితి నేఁడెట్లున్నదో చూచినవెనుక నేనె పోయి తెలిసికొనెదను. (కొంచెము నడచి) భద్రా! బాబుగారేమి చేయుచున్నారు!—ఏమంటివి?——ఉత్తరకుమారికా ద్వితీయులై యున్నారనియా?—అట్లయిన నిది సమయము కాదు—తరువాత వచ్చెదను.

(అని నిష్క్రమించును)

ఇది విష్కంభము.

---



# పద్మవ్యూహము.

## తృతీయాంకము.

### రంగము—అభిమన్యుని శిబిరము.

(తల్పగతుఁడై యభిమన్యుఁడును, ఆసీనయై యుత్తరయును ప్రవేశింతురు)

ఉత్త—ఆర్యపుత్రా! నేఁడు మీకన్నులు కొంచె మెఱ్ఱగా నున్నవి. రాత్రి సరిగా నిద్ర పట్టలేదా యేమి?

అభి—(బలవంతముగా నవ్వి) ప్రేయసీ! యిది నిద్రవచ్చుసమయమా!

సీ. ధర్మమూలకమగు తమ రాజ్యమును బకల్
వంచనచేసి హరించు నపుడు
అన్నిటఁ దాము ప్రజ్ఞాన్వితు లయ్యు న
న్యులకు లోఁబడి యుండవలసి నపుడు
స్వజనంబు నిజరాజ్య సంపాదనార్థము
పలువిధంబులఁ బాటు పడెడు నపుడు
పెరవారు ధర్మతత్పరబుద్ధిఁ దమకు సా
యంబుగ నిల్చి పోరాడు నపుడు
తమకొ తమ వైరికో విజయమునఁ జేసి
శాశ్వతంబగు కీర్తియు, సకలరాజ్య
పదవియు లభించుతరుణము వచ్చు నపుడు
కూర్కు వచ్చునె యెంతటి కూళ కైన!

ఉత్త—ఆర్యపుత్రా! స్వర్గసామ్రాజ్య మెన్నిసారులు దుష్టుల చేతులలోఁ బడ లేదు?—కాని, యెవ్వ రెంతకాలము బాపుకొనఁ గలిగిరి? అట్లే—

చ. భరత నలాంబరీష శిబి బాణ భగీరథ రంతిదేవ సం
వరణ పురూరవః ప్రముఖ పార్థివసత్తము లేలినట్టి యీ

ధర ఖలు లాక్రమించినను దక్కదు వారికి; రాహుబారిలో
ఖరకరమండలంబు చిరకాలము చిక్కుట సంభవించునే?

అభి—(ఉత్సాహముతో) ఓహో!-యెంత చక్కఁగాఁ బలికితివి!-ఏదీ-యొకసారి ముద్దు పెట్టుకొననిమ్ము.

ఉత్త—(లజ్జతోడి చిఱునగవుతో) ఇప్పుడేగదా యైనది!—మరల నింతలోనేనా!

అభి—ప్రియురాలా! ఆమాధుర్యము నీచెక్కిటిలో నున్నది. నాపెదవులు స్వప్నమునందుఁ గూడ దానిని జవిచూడఁ గోరుచునే యుండును—ఆఁ! యేమది- అట్లు కంపించితివి?-నాపలుకులయందు భయకారణ మే మున్నది?—

ఉత్త—ఆర్యపుత్ర! వేకువజామున నాకొక వింతయైన స్వప్నము రాఁగా దానివలన నాహృదయ మేమో కాని—చేయివెట్టి కలచి నట్లయినది. ఇక్కడికి వచ్చినది మొదలు మాటలసందడిలో దానిని మఱచితిని. కాని యిప్పుడు మీరు స్వప్న మనుటచేత మరల నది జ్ఞప్తికి వచ్చి యట్లు కంపింపఁ జేసినది.

అభి—(మందహాసముతో) ముద్దరాలా! విరాటసంతానము స్వప్నములకుఁగూడ భయపడునంత పిరికిగుండె కలదని యిదివఱకు నే నెఱుఁగను సుమా! అయిన, నాస్వప్న మేమో వినిపించెదవా?

ఉత్త—మనమిరువుర మొకయున్నతమైన పర్వతశిఖరమునఁ గూర్చుండి యిష్టగోష్ఠిలో నుండ, నాకస్మికముగ మనయిరువురినడుమ నొక ధూమరాశి బయలువెడలి మిమ్ముఁ జుట్టుకొన్నది! తన్మధ్యమున మీరు కెంపువలె నెఱ్ఱబాఱిన మేనితో నృత్యము సేయుచుండ నేను భయభ్రాంతనై "ఆర్యపుత్రా! ఆర్యపుత్రా!" యని యఱచుటకు మొదలుపెట్టితిని! అప్పుడాపొగనుండి యొకచంద్రబింబ ముదయించి చరచర నాకసమునకుఁ బోయి మరల రెప్పపాటులోఁ గ్రిందికివచ్చి నాగర్భము చొచ్చినది! అంతలో వైతాళికుల ప్రాతఃకాల వర్ణనమువలన మెలకువ వచ్చినది—అప్పటి

నుండియు దీసియర్థ మే మయి యుండునా యని హృదయము పరిపరివిధముల గుంజులాడుచున్నది.

అభి—(మందహాసముతో) ముద్దరాల! స్వప్నములకును శకునముల కును నర్థము తెలియుటకుఁ జాలఁ బాండిత్యము కావలయును! కాని దీసియర్థము స్పష్టముగాఁ దెలియుచునే యున్నది. నీగర్భ స్థశిశువు పురుషశిశువై-చంద్రునివలెఁ జక్కనివాఁడును- జల్లనివాఁ డును- సర్వజనాహ్లాదకరుఁడును నగు నని దీనిభావము. ఇందులకు నీవు సంతసింపవలసినదే కాని-సంచలింపవలసిన పని యేమున్నది?

ఉత్త—(లజ్జతోఁగూడిన మందహాసముతోఁ దల వంచుకొనును.)

అభి—దీనికేమి కాని—ఈసమయమునందు నీకు జరుగవలసిన ముద్దు ముచ్చటల కభ్యంతరము కలిగినందులకు నాకుఁ జాల విచారముగా నున్నది!

గీ. కాసునకుఁ గూడ గతిలేని కష్టజీవు
లైనఁ గడుఁ గూర్చుచుంద్రు చూలాండ్రకోర్కుఁ;
బాండవుల కోడలవు మత్స్యభర్త సుతవు
జరుగకయ పోయె నొక్కముచ్చటయు నీకు.

ఉత్త—(సిగ్గుతోడి చిఱునగవుతో) అత్తగారిపాట మీరుగూడ మొద లుపెట్టినారా? మీరు కడుపులో నుండగా నామె కెన్నియో వేడుకలు జరిగినవఁట—నా కట్లు జరుగుట లేదని యామె రేయిం బవళులు పలువరించుచున్నది. ఇంకొకటి—ఆమెకు నెల తప్పినది మొదలుగ మామగారు నీ కేమికోరిక యున్నదో చెప్పు మని ప్రతిదిన మడిగెడివారఁట. చివర కొకనాఁ డామె "పద్మవ్యూహ మెట్లుండునో చూడవలె నని యున్న" దని చెప్పెనట. తోడనె మామగా రామెను ద్వారకకుఁ దోడికొనిపోయి, యాదవకు మారులచే నా మొగ్గరముం బన్నించి- యామెచే దానిం భేదింపిం చిరఁట. ఈగాథ చెప్పి నీకేమేని కోరిక యున్నచో దాఁపక తె లుపు మని అత్తగారు నన్నడుగని దినము లేదు.

అభి—ఓహో! అలాగునా?-నాకీసంగతి తెలిసినచో నేనే యడిగెడి వాఁడనే! కానిమ్మిదిమొదలుగఁ బ్రతిదినముఁ గాదు—ప్రతిక్షణ మడుగుచుండెదను.

తెరలో—అయ్యో! అయ్యో! చిన్నదేవిగారెందులకో కాని-పట్టు గొడుగుం బట్టవచ్చు పరిచారికను మరలి పొమ్మని చేయి వీచుచుఁ గడుసత్వరముగఁ గాలినడకనె విచ్చేయుచున్నారు!

అభి—(ఉలికిపాటుతో) ఏమి! అమ్మగారా! ప్రేయసీ! చూడుచూడు

ఉత్త—(తొట్రుపాటుతో లేచి వెళ్ళి సుభద్రతోఁ బ్రవేశించును.)

సుభ—(రొజుచు) బాబు! వింటివా యీ విపరీతము!

చ. నలుదిశలం జయించి గగనంబున కంటు జయధ్వజంబులన్
నలుజలరాశితీరముల నాటిన నల్వురు మేటితమ్ములం
గలిగి, నిరంకుశస్థితిని గ్రాలెడు నీపెదతండ్రి యాజిలో
బలిమిని నేఁడు బందిగను బట్టుకొనంబడె నంట వైరిచేన్.

అభి—(అదరిపాటుతో) ఆఁ! యెంతమాట! ఎవఁడురా, అక్కడ ధనుస్సు! ధనుస్సు! (అని చివాలున లేచి యాకసమువంకఁ జూచుచు) ఓ కౌరవ వాహినీపతులారా!

ఉ. అగ్గిని మూటఁ గట్టి యొడిఁయందిడికొంటయొ? గాలకూటముం
బుగ్గను బెట్టికొంటయొ- [1] బుభుక్షను గర్జ యొనర్చు [2] కేసరిన్
దగ్గఱి కోర లట్టిటు గదల్చుటయు న్నరి కావు లేశముం
బగ్గకుఁ బోయి ధర్మసుతుఁ బట్టుటకు న్మదిలోన నమ్మఁడీ!

(సాశంకముగా) అమ్మా! యొకవేళ నీవు విన్నది పొరపాటై యుండదు కదా? ఏమా?—

చ. అమరుల నెల్లరం గొని [3] బలారి స్వయంబుగఁ దోడునూపినం
బ్రమథుల నందఱం గొని [4] కపర్దియె సాయ మొనర్ప వచ్చినన్
[5] యమతనయున్ స్పృశించుటకునైన వశం బగునే విరోధివ
ర్గమునకుఁ! గృంగిపోనదె ధ[illegible]ద్దిశ సంభవించినన్.

1 ఆఁకలి. 2 సింహము. 3 ఇంద్రుఁడు. 4 శివుఁడు. 5 ధర్మరాజు.

సుభ—తండ్రీ! పొరపా టేమియు లేదు. అంతఃపురమున నమరవృత్తాంతము వినిపించు జంఘాలికుఁడు జరిగిన వంతయు స్వయముగాఁ జూచి వచ్చి చెప్పినాఁడు.

అభి—ఎందుల కని!—ఎట్లని?

సుభ—అన్నన్నా! నీ కిటీవలి సమాచార మేమియుఁ దెలియదు కాదా! తాతగారు శరతల్పగతులైన వెనుక నీపెత్తండ్రిగారిని బట్టియిచ్చు శపథముమీఁద సర్వసేనాధిపత్యము భారద్వాజులవారి కొసఁగఁబడినది. కాని, యింతవఱ కాయన యందులకు సాహసింప లేకపోయెను. నిన్నటిసంగ్రామమున నీతండ్రిగారిచేత సంచాలితలోకం బగు సుప్రతీకంబుతోఁ గూడ భగదత్తుఁడు మడియుటయు, అంగరాజు భంగపడుటయుఁ దటస్థింప, దత్పరాభవమునకు సహింపలేక రాత్రి గురునియొద్ద నాశపథమునంగతి యెత్తి కురురాజునిష్ఠురము లాడెనఁట—దుశ్శాసనుఁడు తూల నాడెనఁట—శకుని మేల మాడెనఁట! ఆచార్యులవా రందులకు రోషస్వాంతులై, యెల్లి తప్పక పట్టియిచ్చెద నని చెప్పి, నేఁడందులకై పద్మవ్యూహమును బన్నిరఁట.

అభి—పన్నఁ గాక :—

ఉ. ఖాండవము న్దహించిన యఖండపరాక్రమశాలి, [1] భర్గుతోఁ
ఖండన మాచరించి సులభంబుగ గెల్చిన బాహుశాలి, [2] దో
ర్దండయుగంబున న్విశిఖతండము గుప్పు ప్రతాపశాలి, [3] యా
ఖండలు నర్ధపీఠమును గాంచిన ప్రాభవశాలి లేఁడొకో.

సుభ—అయ్యో! వా రచ్చట నున్న నిఁక నేమి! అట్లయినఁ దమ యెత్తు సాగ దని యాచార్యులవారు త్రిగర్తేశ్వరుఁడగు సుశర్మకుఁ బురెక్కించి, నీతండ్రిగారిని సమరభూమినుండి తొలఁగించి దూరమునకుఁ గొంపోయి నిలువరించుభార మాతనిపై నిడ, నతఁ డందుల కగ్గిముట్టి బాస చేసి, నీతండ్రిగారిని బ్రత్యేకయుద్ధమున కాహ్వానించి సరస్వతీ హ్రదప్రాంతమునకుఁ దీసికొనిపోయె నట!

1 శివుఁడు 2 రెండుచేతులతో 3 ఇంద్రుఁడు.

అభి—(నిట్టూర్పుతో) అగుఁ గాక :—

చ. [1] శమనుని కాలదండమును [2] శక్రుని వజ్రముఁ [3] జక్రపాణి చ
క్రముఁ [4] ద్రిపురారి శూలమును గల్పనసల్పిన దేవశిల్పి డెం
దమున నసూయఁ జెందనెది [6] దానవశిల్పి సృజించె, నగ్గదో
త్తమమునుదాల్చి పొల్పు నల [7] దంతిసహస్రబలాఢ్యుఁ డేమగున్.

సుభ—అయ్యయ్యో! ఆయనను మాతండ్రి మచ్చట నుండనిచ్చిరా! ఆచార్యులవారాయనను దూరమునకుఁ గొంపోయి నిలువరించు భారము సుదక్షిణక్ష్మాపాలునిపై నిడ, నాతండును నట్లే బాస చేసి, కళింగాంబష్ఠ పౌండ్రక దేశాధీశులను సాయముగాఁ గొని యాయన నింకొక దెస కాహ్వానించి తోడుకొనిపోయె నఁట!

అభి—సరి, కానిమ్ము—

చ. గురుని రణంబునం దునుముకోసము పుట్టిన [8] పార్షతుండు, సం
గరభువి వహ్నివాయువుల కైవడిఁ బొల్పు [9] కవల్, కడంగి ని
ర్జరతతినేని యోపఁగల సాత్యకియు న్సతతంబుఁ దోడుగాఁ
బరఁగెడు నా పెదయ్య నెటు పట్టఁగ నోపుదురమ్మ! శాత్రవుల్.

సుభ—ఇదిగో, తెలిపెద వినుము. ఆచార్యులవారట్లు తమ్మిమొగ్గరముం బన్ని, తాము ముఖమున నిలిచి సంతతశరధారాపాతంబున నెవ్వరిని దాపునకు రానీయకున్నంగని మనవారు వెక్కసమును వెఱగుపాటును, వెల్లఁదనమును దోఁప—

సీ. హరియున్న నిపుడు సేయందగ్గవని యిది
యని యేర్పరింపఁడే యనుచు నొకరు
అర్జునుతోడ నియ్యని యెల్లఁ దెల్పితో
డ్కొనిరాక తీఱునే యనుచు నొకరు
అనిలసూనునకుఁ గాకాచార్యుఁ బట్టి మ
ట్టాడ నన్యులకుఁ గాదనుచు నొకరు

1 యముఁడు 2 ఇంద్రుఁడు 3 విష్ణుఁడు 4 శివుఁడు 5 విశ్వకర్మ 6 మయుఁడు
7 భీముఁడు 8 దృష్టద్యుమ్నుఁడు 9 నకుల సహదేవులు

సౌభద్రుఁ డుండిన క్షణములో నీయొద్ద
తునిమి తూఁటాడెడే ననుచు నొకరు
ఎడఁపలం డీలువడి, యూహా తెల్ల వీడి
కదన సంరంభముం జెడి, కలఁగుడు వడి
బెగడి బె బేలువడి, మిన్ను విఱిగి మీఁదఁ
బడిన క్రైవడి నైరఁట! కొడుక! వింటె!

అభి—అందువల్లఁ బెదనాయనగా రేమేని తొందర పడ లేదు గదా?

సుభ—అదే జరిగినది! అట్టి విషమస్థితియం దేమిచేయుటకును బాలుపోక, వారియావేశమునకుఁ దమసాహసమె సాధనముగా నెంచి యొక్క పెట్టునం బోయి, వ్యూహముఖమున నున్న యాచార్యుల వారిం దాఁకిరఁట. అది చూచి, యెల్లవారును వెండియుం జేవ గల్పించుకొని చని తమతమకిఁ బాసట యగునంతఁ, గొంతసేపు ఘోరంబగు పోరు జరిగెనఁట. అట్టియెడ నాచార్యుఁడు నొచ్చిన ట్లభినయించుచు నోసర్లి—

శా. వీరావేశవశంబున న్మ్రానసి నీ పెత్తండ్రి యత్యంత దో
స్సారం బేర్పడఁ దమ్ము మొగ్గరము నిశ్శంకక్రియం జీల్చి, దు
ర్వారాటోప మెలర్ప ముందునకుఁ బోవన్ దోసుగా వెన్క నే
తేరం జూచు బలంబు నడ్డె నఁట యుత్సేకంబు రెట్టింపఁగన్.

అభి—సరిసరి-యిదియా సంగతి! మంచిది-నేనేగి క్షణములో విడిపించి కొని వచ్చెదలెమ్మా. (అని దిగ్గన లేచి) ఓకుత్సిత బ్రాహ్మణుఁడా!

ఉ. అంతయొ యింతయో గురుఁడ వంచును, విప్రుఁడ వంచు, బెద్దవం
చెంతయు నాదుతండ్రులు సహించి యుపేక్ష వహింప, నెవ్వ నా
యంతటివాఁడు లేఁడని మదాతిశయంబునఁ బొల్తు! వట్టిసా
మంతము చెల్ల నేఱ దభిమన్యుని ముందట, నేమి యెంచెదే!

తెరలో—భద్రా! బాలు శిబిరమునకు సుభద్రాదేవి వచ్చినదా?

సుభ—(విని యదరిపాటుతో) బిడ్డా! చూడు! చూడు! పెద్దత్త గారి కంఠమునవలె నున్నది

ఉత్త—(నిష్క్రమించి మరల ద్రౌపదితోఁ బ్రవేశించును.)

ద్రౌప—బాబు! ఈపూట నీచేయి యెట్లున్నది?

అభి—తల్లీ! ఆచార్యుని దుర్మదము సదమదము చేయుటకుఁ జాలిన ట్లున్నది.

ద్రౌప—(వెఱఁగుపాటుతో సుభద్రవంకఁజూచి) ఓసి తెలివిమాలిన దానా!—బాబుతో సంగతి యంతయుఁ జెప్పితివా యేమి?

సుభ—అక్కా! చెప్పక చేయవలసిన దేమి?

ద్రౌప—చేయవలసిన దేమా!—అందులకేకదా వెళ్ళితివి?—నేను రథ మాయిత్తము చేయించుకొని వచ్చుసరికి నీవు మాయమైతివి!

సుభ—అక్కా! నీయభిప్రాయము నాకు బోధపడ లేదు. ఎందులకు రథము?

ద్రౌప—నీకుఁ బద్మవ్యూహమును భేదించువిధము తెలియునుగదా! నాకుసారథ్యము తెలియును. ఇరువురముఁ గలసి నూదిమొనయంత సందు చేసినచో—నీయన్న సాత్యకియు, నాయన్న దృష్టద్యుమ్నుడును మిగిలినపని పూర్తి చేయుదురు.

సుభ—అమ్మయ్యో! అంతటివీరాధివీరులను మనము తెరల్పఁగలమా!

ద్రౌప—ఇసీ! యెంతమాటాడితివి!

ఉ. వీరులనెత్తిచేతఁ గురువిందము చందము నొందినట్టి యీ
భారతభూమియందుఁ గడుపావనవంశమునందుఁ బుట్టి, దు
ర్వార పరాక్రమాఢ్యులగు పాండుతనూజుల యిల్లు మెట్టి, యీ
తీరున శాత్రవాళికి మదిం దలఁకం దగునే? తలోదరీ!

అభి—అమ్మా! యీమె యట్లు పలికినది నన్ను ఘనతఁజూపవలె నని కాని—శత్రువులయందలి భయముచేఁ గాదు. ఇంతకును,

ఉ. ఆనతి యిచ్చి పంపినన్ బలారి కిరీటికిఁ దోడు వచ్చినం
గాని జయించి రాఁగల యఖండ పరాక్రమశాలి యీ భవ
త్సూనుని నింట నుంచి, పువుసోఁకినఁ గందెడు మీరు విల్లు చేఁ
బూని రణాంగణంబునకుఁ బోవఁగ నేటికి నమ్మ? యాంబరో!

ద్రౌప—చాలుఁ జాలు!—నిన్నుఁ బంపుట కిదియా సమయము!

అభి—అయ్యో, తల్లీ!—అట్లనెద వేమి?

సీ. పెదమామ సీరి నేర్పిన గదాయుద్ధ కౌ
శలముఁ జూప నిఁకెప్డు సాగు నమ్మ
చినమామ శౌరి యిచ్చిన సర్వ దివ్యాస్త్ర
ముల కిఁ కెప్పుడు పని కలుగు నమ్మ
కడతండ్రి పనిపట్టి కఱపిన ఖడ్గవి
ద్య కిఁ కెప్పు డవసర మబ్బు నమ్మ
బావప్రద్యుమ్నునిఁ బ్రతిఘటించిన ధను
ష్పాండితి కిఁక నెప్డు ఫలిత మమ్మ
తండ్రి సవ్యసాచి దైవాఱ బోధ గా
వించినట్టి వ్యూహ భేదన ప్ర
కారముల కిఁ కెప్డు కార్యంబు గాఁగల
దమ్మ? యిట్టులాడ నగు నఁటమ్మ!

ద్రౌప—బాబు! నీతండ్రులచేత నశ్వమేధము చేయించి, నీపరాక్రమ మప్పుడు ప్రకటింతువు గాని లెమ్మా.

అభి—అమ్మా! నాయభిప్రాయము నీకు విశదపడ లేదు.

సీ. దాయాదజనుల యధర్మకృత్యంబులు
పిన్న పెద్దలనోట వినెడునపుడు
అడవుల నున్న మి మ్మాత్మఁ దలంచి దుః
ఖించునంబను దిలకించునపుడు
పగవారి పంచను బడియుండి యిడుములు
పడు బామ్మ జ్ఞప్తికి వచ్చునపుడు
కయిసేత లేక యీగతిని జీరాడు నీ
కుంతలంబులు గనుంగొనెడు నపుడు
నేమి యనుకొను చుందు నాయెడఁద దాని
నఖిలవిధములఁ దగుసమయంబు వచ్చె;

నష్టపెట్టక యివ్వు డని కరుగనిచ్చి
కొమరుని యభీష్టముం దీర్చుకొనఁగ నిమ్మ!

ద్రౌప—(ఆనందబాష్పములతోఁ జుబుకము పుడికి) అయ్యో వెఱ్ఱితండ్రి!—నే నేమి సేయుదును!—

ఉ. దాపున లేరు మామయును దండ్రియునుం బెదతండ్రి, చేతియం
దా-పెనుగాయ, మూలము-మహాబలశాలురతోడ, మొగ్గరం
బా-పటుదుర్గమంబు, రిపులా-గతపాపభయుల్, వయస్సునం
దా-పసివాఁడ, హీనసమయముం దని కంపఁగఁ జెల్లునే నినున్!

సుభ—అక్కా! మనకుఁ దోడువచ్చిన వారందఱు నిట్లే వితర్కింప బూనినచో మనకు సహాయులే లేకపోయెడివా రేమో! చూడు,

చ. కడుపునఁ బుత్త్రునిం బడయఁ గల్గిన రాచపడంతి యాత్మ నె
ప్పుడు నెది కోరుచుండుఁ బువుఁబోఁడిరో! దానికి నిప్పు డిట్టు లే
ర్పడె సమయంబు-సందియము వాసి యనుజ్ఞ యొసంగవమ్మ, నీ
కొడుకు ననపాయుఁడై యశము కూర్చును, జేర్చును దండ్రిసంటికిన్.

ద్రౌప—చెల్లెలా! నీవింత జాలిగుండెదాన వని యెఱుఁగను జుమా

సుభ—అక్కా! నన్నిట్టు లంటివికదా—అత్తగారు తమకుమారుల కంపిన సందేశ మేమని!—

శా. "మీరాజ్యంబు హరించి యెల్లయిడుమల్ మీపాలు గావించి మి
మ్మాశ్ర రాటిల్లఁగఁ జేయు శాత్రవుల బాహాబాహి నిర్జించి, ని
ర్వైరంబైన స్వరాజ్య మేలుటయొ పోరాటంబునం జచ్చి య
వ్వీరస్వర్గము చూఱకొంటయొ సుఁడీ! విధ్యుక్తముల్ మీ కికన్."
అని కాదా?—యామె జాడనేకదా మనము నడువవలసినది?

ద్రౌప—అట్లని, సమయాసమయ విచార మక్కఱ లేదా?

సుభ—అక్కా! సమయాసమయ విచారమునకుఁ గూడ సమయాసమయములు కలవు. ఈసమయమున నే నేపాటి వెనుకఁ దీసినను

చ, తమయజమానుఁ డేఁగి రిపుతండము మధ్యను జిక్కి యొంటిగా
శ్రమపడుచుండ, నాయకుని సాయ మొనర్పఁగఁ బోయి యెందఱో

యమపురిఁ జేరుచుండఁ—దనయాత్మజు నంపెడునట్లు నెంతలో
భము సహియింపఁ గల్గెను సుభద్ర యటంచు జనుల్ హసింపరే?

ద్రౌప—హసింతురుగాక!- నేనైనచో నందులకయిన సహింతును గాని—చేతిబిడ్డను నూత వేసి లోతుఁ జూచుటకు సిద్ధపడను.

సుభ-అట్లయిన మన మెన్నటికిని వీరమాతల మనిపించుకొననేలేము.

ద్రౌప—(కోపముతో) అట్లయిన నీయిష్టము!—ఆవును దూడయు నుండ, నడుమ గుంజ యఱచుట తప్పు! (అని వెళ్ళఁబోవును)

అభి—(అడ్డుకొని) అమ్మా! అమ్మా! ఒక్కమాట!—నాయమ్మ మీఁది కోపముచే, నన్ను దీవింపకయే వెడలిపోవుట ధర్మమేనా?

మ. అనుమానింపక నాకనుజ్ఞ యిడుమ మద్యాచార్యు గీచార్యు, గ
ర్ణుని గర్ణుం గసిదీఱ నుక్కడఁచి "యొత్తో! పార్థుఁడే మే, ల్బుఱు
కున నాయమ్ములునాటు వీనిశరముల్ క్రూరమ్ము"లంచున్నయో
ధనుఁ డెంతేఁ గుయివెట్టఁ జేసి, తుటిలో ధర్మాత్మజుం దెచ్చెదన్.

ద్రౌప—తండ్రీ! నీసామర్థ్యము నెడ సందేహ మెవరికి? మఱేమన్న అంతగాయముతో ధను వెట్లు పట్టఁగల వని నాదిగులు.

అభి—దాని కేమి—ఇదిగో! వాపు తగ్గినది—గాయము మానఁబట్టి నది—వ్రేళ్ళు వంగుచున్నవి—

సీ. మాలోటు పూరించి మాట దక్కించె బా
బలి కృష్ణపార్థులు హర్ష మొంద
బెంచినందుల కుద్ధరించె నేఁ డని ధర్మ
తనయుఁ డెంతయుఁ బ్రీతి మోదంబుఁ జెందఁ
బసివానిచే నెంత భంగపాటయ్యె నం
చరిచమూపతులెల్ల నాత్మఁ గుందఁ
దమవారి, యెదిరి సత్వము తెలపడి సుయో
ధనుఁడు చిత్తమున నుత్తలముఁ బొంద
గురుని నవలీల నొంచి, యుగ్రగము చించి
పాండవాగ్రజు విడిపించి, ప్రథితిఁ గాంచి

సుఖముగా వత్తు నాప్రజ్ఞ చూడవమ్మ!
భయము వలదమ్మ! దీవించి పంపవమ్మ!

ద్రౌప—నాయనా! చెప్పవలసినమాటగనుకఁ జెప్పితిని. నీకు వీలుగా నున్నట్లు తోఁచినయెడల మంచి దట్లే పోయిరమ్ము. కాని,—

గీ॥ తనకుమారుని నీతండ్రి దండధరుని
దండకుం బుచ్చెనని జయద్రథ పాతకుఁడు
మదిని నీయెడఁ బగఁ బూని మసలు నంట!
అతఁడు దరి యైన తరి నలక్ష్యంబు వలదు.

సుభ—(ఉలికిపాటుతో) అక్కా! నీ కనేక వందనములు! నేను మఱచినను, యుక్తసమయమునఁ జెప్పవలసినమాట చెప్పితివి!

అభి—(నవ్వి) అమ్మా! [1] అగ్ని వమ్రి న్యాయ మెఱుఁగవా?— మహాగజము లెగిరిపోవునప్పుడు మశకమూ నిలుచునది!

ఉ. చిన్నతనంపుమాట లని చిత్తమునందుఁ దలంపఁబోకు, వే
గన్నులవాఁడు తోడుపడుఁ గాక! విరోధులనెల్లఁ గ్రొల్వులిం
గన్న [2] కురంగశాబముల కైవడి దిక్కులు పట్టఁ జేసి, న
న్గన్న ఋణంబుఁ బెంచినఋణంబును దీర్చెద నేఁడు చూడుమీ!

(ద్వారమువంకఁ జూచి) భద్రా! క్షణములో నారథము సిద్ధము చేసికొని తెమ్మని నాసారథి సుమిత్రునితోఁ జెప్పుము. తల్లులారా! యింతలో నేను లోపలి కేఁగి యాయిత్తమై వత్తునా?

ద్రౌప—బాబు! మంచిది. చెల్లెలా! మన మీ లోపలఁ గ్రొత్త సమాచార మేమైన వచ్చెనేమో పోయి తెలిసికొని మరల వత్తము రమ్మ.

(సుభద్రా ద్రౌపదులు నిష్క్రమింతురు)

ఉత్త—(తనలో) అమ్మయ్యా! బ్రతికితిని!—ప్రాణేశ్వరునితో నా యభిమతముం జెప్పుకొనుట కవకాశము దొరకినది—

అభి—ప్రేయసీ! సన్నాహము త్వరగ ముగియుటకు నీచేతులు గూడ నా కెర విచ్చెదవా?

---

1 నిప్పునకుఁ జెదలు పట్టవని. 2 లేడిపిల్లలు.

ఉత్త—ప్రాణేశ్వరా ! సన్నాహమునందే కాదు-సంగ్రామమునందుఁ
గూడ నాచేతులకు మీసేవాభాగ్య మనుగ్రహింపుఁడు.

అభి—మేలు ! మేలు ! సుభద్రాదేవికోడ లెట్లునవలెనో యట్లే
యుంటివి ? (అని ముద్దు పెట్టుకొని) సరికాని—సంగ్రామము
నందు నీవు నా కేవిషయమునఁ దోడుపడఁ గలవు ?

ఉత్త—ఒక్క విషయమున నన నేల ?

సీ. చెమట గ్రమ్మినఁ బెంట చెఱఁగు వీవన చేసి
విశ్రాంతి యొదవఁగ విసరఁ గలను
సమయోచితములైన శస్త్రాస్త్రముల నెత్తి
యెప్పటికప్పు డందీయఁ గలను
సూతుండు డస్సినఁ జేతఁ గళ్లెము గొని
కడునేర్పుగ రథంబు గడపఁ గలను
శత్రులు దళమైన సరగఁ జాపముఁ బూని
గుఱి తప్ప కలుగులు గుప్పఁ గలను
చెప్ప నేటికి కట్లు చేదోడు వాదోడు
గాఁ జరింతు నెల్ల కార్యములను ;
ఏమి యంటి నన్ను నెడఁద భావింపక
చిత్తగింపు మనవి జీవితేశ !

అభి—సెబాసు ! ఇదిగో యిదీ-పవిత్ర భారతపుత్త్రికా లక్షణము ॥

గీ. సమయ మరుదెంచునప్పుడు జంకు లేక
భర్తవెనువెంటఁ జిచ్చునఁ బడుట కేని
సిద్ధపడఁ జాలునట్టి విశుద్ధురాండ్రె
తగిన బిడ్డలు భరతమాతకు నిజంబు.

ప్రేయసీ ! లోపల మాటాడుకొందము రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.

విష్కంభము.



## విష్కంభము.

సంజ—(ప్రవేశించి) పనివచ్చినప్పుడు కాని పాండిత్యము వెల్లడి కాదు. భారద్వాజుని ధనుర్వేద వైదుష్యమంతయు నీపద్మవ్యూహ రచనయందుఁ బ్రతిఫలిత మగుచున్నది.

చ. దళములుగా సమస్త వసుధాతలనాథుల నిల్పి, కేసరం
బులుగ నమర్చె సర్వ నృపపుత్రులఁ; గర్ణికగా నొనర్చె దో
ర్బలయుతులైన కర్ణ కృతవర్మ సుయోధన దుస్ససేన ము
ఖ్యుల; నిఁకఁ దక్కుచోట్ల నెలకొల్పె జయద్రథ సౌబలాదులన్.

ఆపయిని,

చ. నిలిచి ముఖంబునం దిశలు నించుచు నిష్ఠుర బాణపంక్తులం
బ్రళయసమీర సంక్షుభిత వార్ధివిధంబున హద్దు మీఱి వి
చ్చలవిడిఁ బొంగి వచ్చు రిపుసైన్యము నొక్కట నివ్వారించి, తాఁ
జలిపె సహాయహీనుగ సజాతవిరోధిని మొగ్గరంబునన్.

పాపము! యుధిష్ఠిరుఁ డేస్థితిలో నున్నవాఁడో—యాదుష్టులం దఱుం గలిసి యతని కేమియొగ్గు సేయుచున్నారో తెలియకున్నది. ఒకటి మాత్రము నిజము—ధర్మమార్గమునఁ దలపడినచోఁ బ్రపంచమంతయు నెత్తివచ్చిన నతని చెక్కు చెమర్పదు.

వైశంపాయనుఁ డీవైపున నుండు ననికదా యిటు వచ్చితిని? (కలయం జూచి) ఆమద్దిచెట్టు పలవలలోఁ గూరుచుండి నావంకఁ జేయి వీచుచున్నవా రెవరయి యుందురు? (నిదానించి) ఇఁక నెవరు!—అతఁడే! మేలు!—వ్యూహ మంతయు దృక్పథమున నుండు నెలవు కనిపెట్టినాఁడు! (పరిక్రమించి) మిత్రమా! యేమి విశేషములు!—యుధిష్ఠిరునకు క్షేమమేనా?—ఏమనుచుంటివి?—"దుర్యోధనుఁ డేదియో చెప్పి యతనిం గదలనీక సేనతోఁ గొని వచ్చుచున్నాఁడు శీఘ్రముగ మీఁదికి ర"మ్మనియా?—ఇదిగో వచ్చుచున్నాఁడను.

(నిష్క్రమించును.)

---



# పద్మవ్యూహము.

## చతుర్థాంకము.

### రంగము—పద్మవ్యూహగర్భము.

(లోపలఁ, బాదచారులై యుధిష్ఠిర దుర్యోధనులును,
వెలుపలఁ, జెట్టుపైఁ గూరుచుండి సంజయ వైశంపాయనులును ప్రవేశింతురు.)

యుధి—సుయోధనా! నీవు నిర్దేశించిన స్థలమునకు వచ్చినారము—చెప్పఁ దలఁచిన దేమో యిఁకఁ జెప్పవచ్చును.

దుర్యో—(మందహాసముతో) అన్నా! నీవుమిగుల దయామయుఁడవనియుఁ బ్రాణిహింస నీకు బొత్తిగాఁ గిట్టదనియుఁ జెప్పికొందురు-మన నిమిత్తమిందఱు మడియుచుండ నీవెట్లు సహింపఁ గలుగుచుంటివి?

యుధి—ఆమాట నన్నా? యడిగెదవు?

గీ. అయిదు గ్రామంబు లయిన నిమ్మనిననాఁడు
నిక్కి చెట్టెక్కి కూర్చున్న నీవ కాక
యెవ్వ రుత్తరవాదు లీ యెల్లరక్త
పాతమునకును, బంధు విఘాతమునకు?

దుర్యో—అట్లయిన, నీవు నాయభిప్రాయమునందలి సారస్యమును గ్రహింపలే దన్నమాటయే?

గీ. ధరణి యంతయుఁ బాలింపఁ దగిన మీకు
యాచకుల కట్లు చనటయూళ్ళయిదు దాన
మిచ్చి, కన్నీరు తుడుచుట కిష్టపడమిఁ
దప్పుగా నెంతు వే మనఁ దగు నిన్న!

యుధి—ఓహో! అలాగునా! అట్లయిన, సమయపరికారముమాయర్ధ రాజ్యము మా కిచ్చుట కేల లోభింపవలసి వచ్చెనో!

దుర్యో—అందులకుఁ గారణము చెప్పు మనెదవా? అధికమాసములు కలిసికొన కున్నఁ బదుమూఁడేఁడులును బూర్తి కానేరవు. వానిని వేఱుగా లెక్కించుటకు శాస్త్రము లేదు. కాఁబట్టి మీ మానమయము నెఱవేఱిన దనుటయే తప్పు.

యుధి—అట్లయిన, దానిని నిర్ణయింప వలసినవారు పెద్దలు—

దుర్యో—(వికటముగా నవ్వి) పెద్దలయందును, వారినిర్ణయమునందును నాకు విశ్వాసము పోయి చాలకాల మయినది. ఇంతకు నొక యొఱలో రెండుకత్తు లిముడుట కవకాశము లేనప్పుడా విచారమే యనవసరము. మీరో మేమో రాజ్యమంతయు ననుభవింపవలసినదే కాని పంచుకొనుటయు, మరల నసూయలు పెంచుకొనుటయు నా కిష్టము లేదు. రక్తపాతము లేకుండ దానిం దేల్చుకొనుటకు మనయిరువురకు సమ్మతమయిన మార్గ మొక్కటియే యున్నది

యుధి—అట్లయిన, నదేమో చెప్పరాదా ?

దుర్యో—చెప్పుటకేగదా పిలిచితిని.

క. నలువురి యెదుటను నక్ష
మ్ముల గెలిచితి నీదు రాజ్యమును నే మొదటన్;
గెలువుము నీవును నక్ష
మ్ములచేత నె సకలరాజ్యమును నల్వురలోన్.

యుధి—ఓరి! మాయకాఁడా ?—యిదియా నీ రాకడ !

ఆ. వె. నాఁడు నీ యసూయ, నా యవివేకంబుఁ
గలిసి చేసినట్టి కార్యమునకు
ఫలిత మీ వనస్థ బంధుక్షయము!- సిగ్గు
విడిచి మరల నదియె తడవె దేల ?

దుర్యో—అందె గ్గేమున్నది!—దానివలన నీబంధుక్షయ మింతటితో నిలిచిపోవును గదా ?

యుధి—వెఱ్ఱివాఁడా! * మార్జాల దుగ్ధపాన న్యాయముగా- నీరాకడ నేను గనిపట్ట లే దని యేల యింకను భ్రమపడెదవు ?—

* పిల్లి కన్నులు మూసికొని పాలు త్రాగినట్లు.

చ. మకురుతనంబున న్శకునిమామ సృజించిన మాయదారి పా
చికల మమ్ముం బరాజితులఁ జేసి సమస్తము నీవె మ్రింగు కో
రిక లికఁ గట్టిపెట్టి, తగురీతిని మాసగపాలు మాకొసం
గి, కులము వర్ధిలం గని సుఖింపఁగఁ జూడుమ యిప్పు డేనియున్ !

దుర్యో—ఏమీ ! కలిపోసిపెట్టినను నుట్టివంకనే దృష్టియా! మీ నిలివె జేసి నేలలకంటె మీ కధికముగా నిచ్చువాఁడ నని యెన్నఁడు నను కొన వలదు.

యుధి—అనుకొననే లేదు ! ఏమా?—నీవు చిల్లపెంకువంటివాఁడవు, చిల్లపెంకు పగులును గాని—వంగదు, మంచిది, యీయనే వలదు కాని—

చ. పరువుఁ బ్రతిష్ఠయుం గలిగి పావనమై తనరారునట్టి స
త్కురుకుల మందుఁ బుట్టి, యిటు ధూర్తుఁడవై మనఁజూచెదేల!నీ
శరములు విండ్లుఁ గాల్చి మసి సల్పుటకా! మముఁ బోరఁ గెల్చి సు
స్థిరముగ నేలికొమ్ము జగతీతల మెల్ల నిరంకుశంబుగన్.

దుర్యో—ఓహో ! వంటయిలు సొచ్చినకుందేలు వంటరితోడనే చెల గాటము లాడుచున్నదే !

చ. అడవుల నీవుఁ దమ్ములును నా కలముల్ తిని, మాడి, మగ్గి, చే
డ్పడి, చెడి, చేరుకొంటి రని భావమునం గరుణించి, మంచికై
తొడరగఁ దార్చుమారి యిటు తుచ్ఛమ-కంపలఁ బడ్డ కాకి వా
టెడఁద నెఱుంగకుంట ! నిపు డెవ్వరు నీ కిట దిక్కు మందుఁడా !

యుధి—ఓ యవివేకుఁడా ! నీతమ్ము లగ స్వభ్రాత లగుటచే నీకు దిక్కు లేకపోవలెను గాని—నా కేమి ?—

చ. నలుదిశలం గలట్టి నరనాథుల నెల్లర బాహుశక్తి వ
శ్యులుగ నొనర్చి నాదు పదయుగ్మమునం బడవైచినట్టి త
మ్ములఁ గలవాఁడ నేను ! నిను బోంట్లకు నగ్గువిచ్చి చూడనే
నలవియె ! చేటు దగ్గఱుట నారయకుంటివిని కాఁడా! మూర్ఖ,

దుర్యో—(రోషముతో) అలాగుననా! మంచిది—చేతుకాల మెవరికిఁ జేరువమైనదో యిప్పుడు తేలఁగలదు-వచ్చి రథమెక్కుము! లొటిపిటశూల రోకళ్ళుం గాని పోదు గదా! (అని వెనుకకు దిరిగి చప్పటులు గొట్టును.)

దుశ్శా—ఉ. చాలును జాలు! నేల తెగనాగెదు! చావఁగవచ్చితిచ్చటన్
కర్ణు— వ్రాలుము చక్రవర్తి పదపద్మములం బ్రతుకం దలంచినన్
సైంధ— గాలమునం దగుల్కొనిన గాడిద వైతివి నేఁడు చూచితే
శకు— తాళుఁడు మీర-లీతని మదం బడఁగించెద నే నొకండనే.

(అని పలుకుచుఁ దెరఁ జిమ్ముకొని బ్రవేశింతురు.)

యుధి—ఓహో—యేమిపీరాలాపములు! ఓవ్యర్థప్రలాపులారా!

శా. నిర్వాకస్థితి మీనృపు స్సఖుల బద్ధీభూతులం జేసి గం
ధర్వుల్తోడ్కొనిపోవునప్పుడును; మాతమ్ముండుమూఁరాస్త్రముం
బర్వంజేసి శిరోంబరంబులు గ్రహింపం బూనికొన్నప్పుడున్
గర్వగ్రంథుల రీర లేమయితిరో కాసింత విన్పింపరే!

దుర్యో—ఓయసందర్భప్రలాపీ! యెప్పటిమాటమో యిప్పు డేల? ఇప్పుడు నీవు చచ్చితివి చూచుకొనుము!—

యుధి—ఈ బెదరింపులు చా వన్న భయపడువానికడ నుపయోగించును గాని, నాకడఁ గావు! నా కెట్లయినను సంతోషమే.

ఉ. మమ్ములఁ బాపభీరుల నమాయికులం గను మాయ చేసి రా
జ్యమ్మఖిలమ్ముఁ జూరకొనినట్టి నినుం దెగటార్చి రాజ్యసౌ
ఖ్యమ్మయినం గడింతు; నటు కానిరొడ న్నిహతుండనై స్వరా
జ్యమ్మునకై యొసంగెఁ దను వన్నయశం బయినం గడించెదన్.

అందఱు—మొదటిది కల్లగాని—రెండవదిమాత్రే మిదిగో! యిప్పుడే యథార్థము కాఁగలదు! (అని చుట్టుకొందురు,)

(తెరలోఁ బెద్ద కలకలము.)

అందఱు—(నిశ్చేష్టులై దిశలు పరికింతురు.)

దుర్యో—దిగ్గజ కర్ణకుహరంబులను దిబ్బళ్ళు వాఱఁ జేయు నీమహా
కలకల మే మయి యుండును జెప్పుమా!

కర్ణ—కుంకుమప్రభా విభాసితంబయి, భూమండల నభోమండలముల
నేకముసేయు నా ధరాపరాగమో!

తెరలో—ఓహో! వీరభటులారా!

మ. రభసోల్లాసము లొప్ప, సంకృతి యపారంబై దిశ ల్గప్ప; వీ
రభటానీకము నొంచి, ద్రోణుని శరీరంబెల్లఁ గారించి, వీ
తభయుండై యభిమన్యుఁ డొడ్డనమునం దర్పంబుమైఁ జొచ్చె! భూ
విభునిం జేరఁగఁ బోయి శీఘ్రముగ నీ వృత్తాంతమున్ దెల్పుఁడీ!

దుర్యో—ఏమీ! భీమయో దోమయో మొగ్గరము సొచ్చినందుల
కేనా—యీ సింగినాద మంతయును!

తెరలో—గీ. పార్థసూనుఁడు వ్యూహము పాయగా నో
నర్చి నాయకుఁడుగ ముందు నడచుచుండఁ,
గడమవారలు దమ యిరుగడలవారి
నొంచుచు న్వెంటఁ బఱతెంచు చున్నవారు!

దుర్యో—(తొట్రుపాటుతో) అట్లయిన, వెంటనే యావంకకు వెళ్ళవలెను! (కర్ణునితో) మిత్రమా! * గృహబద్ధ కుమారీ న్యాయముగా-సీతని నిప్పటి కిచ్చటనే యుండనిచ్చి, శీఘ్రముగా రథస్థుండవై వీరినిఁగూడ వెంటఁ గొని నీవును నచ్చటికే రమ్ము.

(దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకుని సైంధవులు నిష్క్రమింతురు.)

యుధి—అన్నన్నా! యొంటరిగా నే నిందుఁ జిక్కువడినందులకుం గొందలపడుచు వారుతొందరపడి యస్వస్థస్థితియందున్న బాబును దోడ్కొనివచ్చిరి కావలయును! నిజమునకుఁ బార్థునితరువాత నితడు తక్క నీవ్యూహభేదన క్రమ మెఱిఁగినవారు లేనప్పుడు వారింత కంటెఁ జేయఁ దగినది లేదు కాని—నానిమిత్తము, వలను దప్పి పడియున్న పసిపిల్లవాఁడు లేచి రావలసి వచ్చుట సంతాపకరము!

......కానిమ్ము—మించినదానికి వగచిన నేమి లాభము—

* ఇంటఁ గట్టిన కలబంద చావను జావక పెరుఁగను బెరుఁగక యుండునట్లు.

అన్యోన్య సాహాయ్యమున నాచార్యుని యత్నమును, సుయోధనుని యాశయమునుగూడ వ్యర్థములు గావించి, భీమార్జునులు లేనిలోటు కానరాకుండఁ జేసెదము. (అని నిష్క్రమించును.

వైశం—అమ్మయ్యా! ఇప్పటికి నాగుండెలు కుదుటఁ బడినవి! * జాల మత్స్య న్యాయముగాఁ జిక్కువడి యున్న యీతని కాదుష్టు లేమి యెగ్గు సేయుదురో యని నాహృదయము తల్లడిల్లినది!

వంజ—సరి కాని—అటు చూచితివా!—

సీ. తనదు సంగర సముత్సాహంబు నిజముఖ
సీమ నత్యంతముఁ జిందు లాడఁ
దన కర్ణికార కేతనరోచు లంబర
దేశంబునకుఁ జాలఁ దేటుఁ గూర్పఁ
దన రథనేమి నిస్వనము దంతావళ
తురగ సంతతులకు దుర్భ్రమఁ జేయఁ
దన ధనుర్జ్యానినదం బరాతి చమూస
మూహంబు నెల్ల సమ్మోహ పఱుప,
కదనతల మెల్ల దివ్యాశుగములచేతఁ
బగఱ హృదయంబు లెల్ల విభ్రమముచేతఁ
బ్రబలముగఁ గప్పివచ్చుచుఁ, బ్రళయకాల
రుద్రుఁ బోయున వచ్చు సౌభద్రుఁ గంటె!

వైశం—వచ్చుటమాత్రమే కాదు!—

సీ. వీరుల మస్తముల్ విరియముగ్గిన తాళ
ఫలములలీల భూస్థలిని రాల
తేరులు పిడుగు మొత్తిన శాల్మలీవృక్ష
ముల విధంబునఁ బెళపెళను విఱుల
కుంజరయూథముల్ కులిశఘాతము లైన
యద్రుల పోలిక నవిసి కూల

* వలలోఁ జిక్కిన చేపఁ లోపల నుండి సర్వమును జూచుచు బయటికిరాఁజాలన

ఘోటకప్రతతులు కుట్లు వీడిన కీలు
బొమ్మల చందానఁ బుడమి వ్రాల
ధ్వజవితానంబు లెల్ల సూత్రములు తెగిన
గాలిపడగల పగిది నల్లడలఁ దూలఁ
గౌరవబలంబులం గడుఁ గసిమసఁగి
చీల్చి చిందర వందర సేయుఁ దొడఁగె!

సంజ—పాప మిప్పు డేమగునో కాని—ఆచార్యుడు వెనుకవచ్చి వారి నడ్డెను;—ఒకవైపునుండి దుర్యోధన దుశ్శాసన కర్ణ వికర్ణ ప్రభృతులును—మఱొకవైపునుండి కృపాచార్య కృతవర్మ వృషసేన ప్రభృతులును—వేఱొక వైపునుండి బాహ్లిక సోమదత్త భూరిశ్రవో లక్ష్మణకుమార ప్రభృతులును—దమతమబలంబులం బురికొల్పుచు నొక్కపెట్టునం బోయి ముట్టడించుచుండిరి'...... ఆఁ! పోసిమ్మ—యుధిష్ఠిరుఁ డతనిం జేరఁబోవుచున్నాఁడు.

వైశం—కాని—యా యసహాయశూరున కీతని సాయ మవసరమే లేక పోయినది!

గీ. పరుగు పరుగున బఱతెంచు పగతురు తన
పజ్జకుం జేరికొని తలపడక మున్నె
రివ్వు రివ్వున శరములు రువ్వి వారిఁ
జెట్టులుం బుట్టలుం బట్టఁ జేసె నదిగో!

సంజ—ఓహోహో! కర్ణునంతవాడు గూడఁ గాలికి బుద్ధిచెప్పు కొన్నాఁడే!—సరి కాని—రథంబు డిగ్గి-మొగంబు వాడ, సిగ ముడి వీడఁ, దూణీర మూడఁ, జెమ్మట లోడ, బ్రాణములమీఁది తీపి మె యీతగా నీవంకకుఁ బరువిడి వచ్చు నీతఁడెవఁడు ?

వైశం—(నిదానించి) ఎవరోనా! మీ దుశ్శాసన మహారాజుగారు! అదిగో! అభిమన్యుఁడును సత్వరముగాఁ దేరు తోలించుకొని యీతనికొఱకే కావలయు నిటే వచ్చుచున్నాఁడు

(తెరలో)

చ. నిలు నిలు ! పోకు పోకు! యవినీతుఁడ! మింటికిఁ బ్రాకినన్, రసా
తలమునఁ దూఱినన్, జలధి డాఁగిన, నాదు నిశాతసాయకం
బులు నిను వీడి క్రమ్మఱఁగఁ బో; విధి బుద్ధియె నిన్నుఁబోలుస
త్కులజునకుం? గులంబునకుఁ గూర్తువె మాయనిమచ్చ దుర్మతీ!

పంజ—శివాశివా! అతని కేక యితనిపరుగును మఱింత పెంపొందించినది

వైశం—తాళు తాళు, అభిమన్యుఁడు మరల నేమో యనుచున్నాఁడు!

తెరలో—ఏమీ ! నాయుపాలంభనము నిన్ను నిలువ లేకపోయినదిగా !—మంచిది—ఇదిగో—యీశృంఖలాస్త్రము నిలుపఁగలదు చూడుము !

దుశ్శా—(పరుగునఁ బ్రవేశించి యట్టె నేలఁ గూలును)

అభి—(ఒక్కదాఁటునఁ బ్రవేశించి, దుశ్శాసనుని రొమ్ముపై మోకాలూని హస్తుండెడి దట్టిలోని యసిపుత్రికం దీసి) ఓరీ ! కౌరవకులకలంకా! నీవు నా బారినుండి బ్రతికి పోఁజాలవని చెప్ప లేదా ?

చ. పరమ పతివ్రతామణియుఁ, బావకజాతయు, నైన ద్రౌపదిం
బరబర కేశపాశమును బట్టి సభాస్థలి కీడ్చి, మేని యం
బర మెడలింపఁ బాల్పడిన పాపపు నీకయిదో యి ముందుగా
నఱికి, భవచ్ఛిరంబు దళనం బొనరించెదఁ గాక! యవ్వలన్.

(తెరలో)—బాబు! తొందరపడకు! తొందరపడకు !

గీ. వీనివక్షంబుఁ జీల్చి యావెచ్చనెత్తురి
తలకు మెఱుఁగిడి, నీ పెదతల్లి కురులు
ముడువ శపథంబుఁ గొనె వడముడి; తదీయ
సమయమున కంతరాయము సలుపఁ దగదు.

అభి—(ఎత్తిన చేయి దించి) ఏమీ! ఆలాగుననా ? ఓదుష్టుఁడా ! పెదనాయనగారి యాదేశ మిప్పటికి నిన్ను బ్రతికించినది; (వక్షము నుండి లేచి) నీయదృష్టదేవతను స్మరించుకొనుచుం బోయి, మరల నాయెదుటఁ బడకుండ మాత్రము మసలికొమ్ము.

దుశ్శా—(లేచి యొడలు దులిపికొనుచుఁ జక్కఁబోవును)

సుమి—(అంతటఁ బ్రవేశించి) భర్తృదారకా! మిమ్ము రథమునుండి దిగనీయవలదని దేవిగారు నాతో మఱిమఱి చెప్పినారు. కాని, మీ రాకస్మికముగ నేలకు లంఘించుటంజేసి వారించుట కవకాశము లేకపోయినది. దయచేసి, యిఁక రథ మధిష్ఠింపుఁడు.

అభి—(నవ్వి) ఏమి! కుక్కలు కాలు కఱచు నని కావలయును దల్లిగారి భయము! మంచిది—అట్లే చేయుదును గాని—యీకట్టు సడలినది—కొంచెము బిగింపుము. (అని యెడమచేయి చాచును.)

సుమి—అమ్మయ్యో! గాయము రేఁగినది కావలయును- జుట్టినపట్టమంతయు నెత్తుటఁ దడిసిపోయినది! రథము కడకు రండు- ఈకట్టు తీసివేసి క్రొత్తపట్టము చుట్టెదను.

అభి— మంచిది నడువుము. (అని సుమిత్రునివెనుక నడచును)

(తెరలో)

చ. నిలు మిదె వచ్చుచుంటిఁ, దెగనీల్గెద వేమిటి కింతలోన? యి
ల్లలికినతోనె పండు వగునా? ముదిబాపఁడు దారి యీయ రాఁ
గలిగితి, వంతెకాక మొనగాఁడవె యబ్బలకంటె! నేఁడు నీ
తలఁ దెగఁగొట్టి పార్థుని మదం బడఁగింపక పీనువాఁడనే!

అభి—(చివాలున వెనుకకుఁ దిరిగి) ఏమీ—కురురాజేనా!... సుమిత్రా! శాత్రవుఁడు వచ్చి పిలుచునప్పుడు వెనుక కడుగు వేయుట వీరధర్మము కాదు. నీవు పోయి రథమునే యిచ్చటికిఁ గొనిరమ్ము. (అని సుమిత్రుఁడు నిష్క్రమింప; దుర్యోధను నుద్దేశించి) ఓ కురుకులపాంసనా!—సుయోధనా!

ఉ. కాంచితో లేదో తమ్మునకుఁ గల్గిన పాట్లిపు! డాహవం బనన్
వంచకవృత్తిఁ బాచికలు వైచుటగా—మది నించు కేని యె
గ్గెంచక సాధ్వులన్ సభల కీడ్చుటగా—వడి వారివల్వ లూ
ల్పించుటగాఁ-దలంచితొకొ? బీరము లాడఁగఁ జొచ్చి తీక్రియన్!

(అని యంతలో రథము రాఁగా దాని నధిష్ఠించును)

దుర్యో—(రథస్థుఁడై పరివేశించి) ఓ క్షీరకంఠుఁడా!—

అభి—ఔను, నేను క్షీరకంఠుఁడనే—కాని, నీవు విషకంఠుఁడవు!

తరువాయి చెప్పుము.

దుర్యో—విషకంఠుఁ డన నెవరో యెఱుఁగుదువా?—నిటలాక్షుఁ డన్న మాట!—

అభి—నిటలాక్షుఁ డన నెవరో యెఱుఁగుదువా?— నాతండ్రిచేఁ బరాజితుఁ డయినవాఁ డన్న మాట! నాఁ డావిషకంఠుని మదము నాతండ్రి యడంచెను; నేఁ డీవిషకంఠుని మదము నే నడంచెదను.

దుర్యో—పిట్ట కొంచెము, కూఁత ఘనమనునట్లు, పలుకులకుఁ బెద్దవే!

అభి—పలుకులకే కాదు—ములుకులకుఁ గూడను. చూడు;—

సీ. అదయాంతరంగుండ వగుచు నన్నములోన
విషము పెట్టించిన వెడఁగుఁ దనము
నడురేయి నిద్రించు నెడఁ జలంబున లక్క-
యిల్లుఁ గాల్పించిన హీనవృత్తి
అక్రిమాక్షుంబుల నఖిలరాజ్యంబును
దోపుడు గొన్నట్టి దుర్నయంబు
సాధ్వీమతల్లి పాంచాలిని సభ కీడ్చి
వలువ లొల్పించిన తులువతనము
తలఁపునకుఁ దెచ్చి, నీతలఁ దరిగి, తల్లి
దండ్రులకుఁ బ్రీతిఁ గావించు తరుణ మెప్పు
డబ్బునా యని చూతు- నేఁ డది లభించెఁ
బాటిపోవక నిలిచి- నా ప్రజ్ఞ గనుము!

(తెరలో.)

చ. వచ్చెను వచ్చెఁ! బార్థివుఁడు! చంపక మానెడువాఁడు గాఁడు వి
వ్వచ్చుని పట్టి నేఁడు! కృతవర్ముఁడ! చూచెద వేమి? కర్ణుడా!

చెచ్చెరఁ బొమ్ము—బాహ్లీకుఁడ! చేరుతోసంగదె తేఁ.-నేనునున్
వచ్చుచునుంటి-నోకృపుఁడ! వాహినులం బురికొల్పు మాదెసన్!

అభి—(తనలో) ఓహో! ఆచార్యులవారి ప్రభువిశ్వాసము! కాని
మ్ము—వారు వచ్చులోపలనె నేనీతనిం దెగటార్చి యందఱకు
నాశాభంగము కావించెదను. (అని వింట శరమును సంధించి)
ఓ మూఢసుయోధనా!

గీ. సాలెపురు వస్త్రములకు నై సంతరించు
పట్టునం దానె సమసెడు భంగి; ధర్మ
పుత్త్రునింగూర్చి కూర్చిన మొగ్గరమునఁ
జచ్చెదవు నీవె చూడు మీ శరము చేత!

తెరలో—ఆఁ! ఆఁ!—బాబు!—విడువకు! శరము విడువకు!!

గీ. కదనమున వీనితొడలు భగ్నంబు సేయ
భీమసేనుఁడు ప్రతిన గావించి యుండె.

అభి—(నిరుత్సాహముతో) ఏమి! యీతనికిని ఆయనశపథమే యడ్డు
వచ్చినదా! ఈ యమోఘాస్త్ర మింక నెవరిపై విడుతును!

కర్ణు—ఉ. ఓరియువాధమా! మదమదోద్ధతిఁ ద్రుళ్ళిపడంగబోఁక నీ
తేరు మరల్చి యీదెసకుఁ, దేఁకువతో ననుఁ దాఁకి, నీదు దో
స్సారముఁ జూపు! మింక నిను సైప, భవన్మృతి యాలకించి నీ
వారలు గుండె వ్రీలి విడువ న్వలెఁ బ్రాణము లొక్క పెట్టునన్!

(అని పల్కుచు రథస్థుఁడై ప్రవేశించును)

అభి—(తిరస్కారముతో నవ్వి) ఓహో, అంగరాజుగారా! రండు
రండు—ఇందాఁకటి మీస్థితి చూచి మరల దర్శనము కాదను
కొన్నాను! సరికాని-మనలో మన మాట!—

చ. పలుకుదువంట బీరములు ఫల్గును నేఁ దెగటార్తు నంచు!- నీ
పలుకుల కుబ్బి యీనృపతి ప్రాభవవంతునిగా నొనర్చి, ని
చ్చలు దనతో సమానముగ సర్వము నీకిడుచుండు నంట!- కే
వల మటు భీతిఁ దేరు దిగి పాఱుటకుం దప్రిప లేకపోయెనే!

కర్ణ—(రోషముతో) ఓరి వాచాలుఁడా! ముక్కుపచ్చి యాఱని ముగుదుఁడ వని సైప, నీస్థితి శ్రుతిని మించి రాగమునఁ బడినదే!

గీ. తండ్రు లడవుల పాలయి తనకు చుండఁ-
జేరి మామల పంచను, దేరకూడు
గుడిచి, దొరబిడ్డ లాగునఁ గ్రొవ్వి, యిట్లు
ముడిసి పడియెద వేమందు మిడుత వోలె!

అభి—(నవ్వి) ఓహో, యెంతదోషము వెదకితివి!

గీ. మేనమామల యింటను మెలఁగుటయును
గించుదన మేని—పెరవారి పంచఁ జేరి,
పవలు రే యిచ్చకము లాడి, బ్రతుకు నీదు
జీవితఁ బెట్టి దానో యోజించుకొనుము!

కర్ణ—ఓరీ! వదరుఁబోతా! వీరుల యంపపెట్టెఱుఁగక విఱ్ఱవీగు నీతోఁ బ్రసంగ మనుచితము. ఏదీ—నీకభిమానముగల యస్త్ర మేదో దానిని నాపైఁ బ్రయోగింపుము!

అభి—(ధనుస్సు పైకెత్తి) అంతవఱకుఁ బని లేదు—మీ రాజుకొఱకు సంధించిన బాణ మిదిగో సిద్ధముగానే యున్నది! చూడు,

ఉ. దారుణమైన యీరణము తారసిలెం భవదీయ దుర్నయ
ప్రేరణచేత; నాజిఁ బృథివీపతి మమ్ము జయింప నిన్ను నా
ధారముగా గణించుకొని త్రివ్వుకొనెం దనగొయ్యి తానె! నీ
వీరము లెల్లఁ దెల్ల మగుఁ, బృథ్వీపు నాశయుఁ దీఱు దీనిచేన్!

తెరలో—బాబు! వలదు! వలదు! ఈతనింగూడ నీవు విడువవలసినదే!

గీ. ద్రుపదసుతఁ గాంచి నవ్వినందులకు సభను
పార్థుఁ డీతని వధియింపఁ బ్రతిన పట్టె!

అభి—(విసుగుతో) ఇస్! అబ్బా! అయినవారిని నలుగురిని వారే పంచుకొనినప్పు డిఁక నాచేతి కేమి పని యున్నది!

(తెరలోఁ జప్పుడు)

దుర్యో—(చప్పటులు గొట్టుచు) సెబాసు! బృహన్నలా!—సెబాసు!

నోటిలోనిమాట నోటిలో నుండఁగనే ముదిరాజును జక్కఁగా మూర్ఛఁ బొందించితివి!

అభి—(ఉలికిపడిచూచి) ఓరి దుష్టుఁడా! మదేశ్వరునితోఁ బోరుచున్న మాపెదనాయనగారి సారథముల చాటునుండి యేసితివా! ఇదిగో!-మీరాజుకొఱకు సంధింపఁబడిన యీవిషబాణమును నీవు చవి చూడుము! (అని ప్రక్కకు విడుచును)

దుర్యో—(చూచి విషాదముతో) అన్నన్నా! మన మిచ్చట నుండఁగనే యీబుడుతఁడు బృహద్బలు నిట్టె బలిగొనినాఁడే! (ఆగ్రహముతో) ఓరి! బాలహంతకుఁడా! మాబృహద్బలుని వెనుకనే నీవును యమపురి కేఁగఁ గలవు చూడుము—

తెరలో—ఆ. వె. కావు మయ్య కర్ణ! కావుము కురునాథ!
అంబరంబునుండి యసురుఁ డెవఁడొ
విలయమేఘ మట్లు పిడుగులు గురియుచు,
నుల్క వోలె దిగుచు నుండె భువికి!

దుర్యో—(గిచ్చపాటుతో) ఎవఁడు చెపుమా వీఁడు!- కానిమ్ము! ఎవఁడైన నేమి-ఓ సైనికులారా! వెఱువకుఁడు! ఇదిగో మేము మాట వెంబడినె వచ్చుచున్నారము. మిత్రమా! రమ్ము, రమ్ము! అదేమో ముందు చూడవలెను. (అని కర్ణునితో నిష్క్రమించును)

అభి—(తనలో) ఒకవేళ, మాయన్న ఘటోత్కచుఁడు కాఁడుగదా! అతఁడే! అదిగో! నన్నుద్దేశించి యేమో యనుచున్నాఁడు;

(తెరలో)

మ. జనయితృప్రపంగ నీకుఁ గలన న్యాయంబుగా నుండ వ
చ్చినవాఁడం, బెదతండ్రి మూర్ఛ కలిగించె న్విఘ్న మద్దాని; కీ
యన సిగ్గేరిచి యిట్టె వచ్చెదను, సైన్యం బంతయు న్నీవె పె
ల్చనఁ దున్మాడక తమ్ముఁడా! యిడుము నాసాంబాలు'నా కేర్పడన్.

అభి—(పైకిఁ జూచుచు) అన్నా! సమయమునకుఁ జక్కఁగా వచ్చితివి! ఇచ్చట మనయిరువురకుం జాలినంత పని లేదు కావున-

బెనాయనగారిని జాగ్రత్తతోఁ గొనిపోయి శిబిరముఁ జేర్పుము.

తెరలో — ఓహో - వీరాగ్రేసరులారా !

ఉ చూచెదరేమి టిచ్చవడి చోద్యముగా వెఱబొమ్మలట్లు ! రయా నీచుఁడు పాండవాగ్రసరునిం దన తేరునకుం దరల్చి, సం కోచములేక మింటి కదిగో ! కొనిపోయెను; గుర్వరయ్యా నా రాచపరంపరల్ గిరగిరం భ్రమరించుచు నేలఁ గూలఁగన్.

అభి — ఓరోరి దుష్టులారా ? నే నిచ్చట నుండఁగా మీరు మాయన్న సిగపూవునైన వాడింపఁ గలరా ? సుమిత్రా ! అదేమో చూత ము-శీఘ్రముగ మనరథ మటు పోనిమ్ము.

సుమి — చిత్తము. (అని రథము తోలుకొని పోవును)

సంజ — ఓహో ! ఘటోత్కచుని యాకాశయాన మెవ్వరికిం గానరా కుండ నెంతలో నంతర్ధాన మయినది !

(తెరలో గొప్ప కలకలము)

సైంధ — మిత్రమా ! ఆవంక నాకలకల మేమై యుండును ?

సంజ — ఆవంక జరుగునది నీవు చూడనె లేదు కావలయును ! భారద్వాజుఁ డిందాఁక విరోధి నిరోధనభారము సైంధవునిపై నిడి, తాను దుర్యోధన సంరక్షణార్థ మిటు వచ్చుచు యుధిష్ఠిరునిచే నిలువరింపఁ బడెను గదా ? సైంధవున కది దుర్భర మైనందున నతఁడు చిరకాలమునుండి పాండవులకొఱకు దాఁచి యుంచికొనిన స్తంభనాస్త్రముం బ్రయోగించి, నకుల సహదేవ విరాట ద్రుపద దృష్టద్యుమ్న సాత్యకి ప్రభృతులను స్తబ్ధులం జేయఁ గౌరవబలము కరతాళధ్వనులతోఁ గోలాహలము సేయుచున్నది.

(తెరలో మరలఁ బెద్ద కలకలము)

సైంధ — (ఉలికిపడి) ఈవంక నీకలకల మేమిటి ! (నిదానించి) ఓహో తెలిసినది ! కర్ణ దుర్యోధనులతో నొక్కసారిగఁ దలపడి, వారిని బాణవర్షమున ముంచి యెత్తుచున్న యభిమన్యుని సంరంభము చూచి, యాచార్యుఁడు చేయివీచి పురికొల్ప-రథనేమి గజఘంటా

హయకింకిణీ నినదంబులతోడను, పదాతిసింహనాదంబులతోడను, యోధానుయోధు లందఱు నొక్కపెట్టునం బోయి మహారౌద్రముగ సౌభద్రుఁ జుట్టుముట్టుచున్నారు !

సంజ — కాని, యేమిలాభము!- వారు ప్రయోగించిన యాయుధము లన్నియు * తప్తాయసపత్రి బిందు న్యాయముగా- వ్యర్థము లైనవి

సీ. కర్ణుఁడు చచ్చిన గతి సొమ్మసిల్లెను,
దుర్యోధనుఁడు తేరు దుమికి పాఱె

వైశం-అశ్మకుం డిలఁ గూలె, సల రుక్మరథుఁ డీల్గె,
విందుఁడు సారథి వెనుక కొదిగె

సంజ — కృతవర్మ పఱచెను, కృపుఁడు మూర్ఛిల్లెను,
గటకటా ! కంటె ? లక్ష్మణుఁడు చచ్చె !

వైశం-వృషసేనుఁ డోడె, సువేగుఁడు మడసెను,
శల మద్రవిభులు నిస్సారు లైరి

సంజ — పేరుగలవార లంద ఱీరు గాఁగఁ,
గోఱని త్రిప్పిన చందానఁ గ్రిమ్మరిలుచు—

వైశం — మూరి మసఁగిన విధమున మారణంబు
నలుపఁగాఁ జొచ్చెఁ గురుసేన పలుచపడఁగ.

సంజ — తాళు, తాళు !- మూర్ఛ తేఱిన కర్ణు నుద్దేశించి యభిమన్యుఁ డేమో యనుచున్నాఁడు.

తెరలో-గీ. భాను నీజోలి కిఁక నంగరాజ ! భీతి
మాని, దిటవూని, చాపముఁ బూని పరశు
రాముకడ నీవు నేర్చిన దేమొ—నాదు
కడఁ బరీక్ష యొసంగుము కలఁకఁ దేఱి !

వైశం — ఆమాట యాయువుపట్టున నాటినది కావలయును !- కర్ణుఁడు కాలపృష్ఠమును మ్రోయించుచు మరలఁ దలపడుచున్నాఁడు! ఓహో ! ధనుర్విద్యాపారంగతులగు నయ్యుభయుల దివ్యాస్త్రప్రయోగకౌశల మెంతచమత్కారముగా నున్నది !

* కాలిన పెనముపైఁ జల్లఁబడిన నీటిచుక్కలవలె.

పద్మవ్యూహము

గీ. కన్ను మిన్నుఁ గనఁబడని చీఁకటు లొకప్డు;
వేయిసూర్యులు వాడిచిన వెలుఁ గొకప్డు!
అంబునిధు లింకు నగ్నిహోత్రం బొకప్డు;
జగతి యెల్లను ముంచు వర్షం బొకప్డు!

సంజ— వీరిశీకులగు కౌరవయోధుల యవస్థ యంతకంటెను జమత్కారముగా నున్నది!

గీ. అంగరా జస్త్రము మడరించు నప్పుడెల్ల
బహుతరామోదమునఁ దాండవం బొనర్తు;
పార్థసూనుఁడు నవ్వుచుఁ బ్రతిశరమున
దాని నడఁగించు నప్పుడు తలలు వంతు!

వైశం— అన్నిటికంటెను జమత్కార మింకొకటి—

క. విడిచిన యస్త్రము నడుమనె
చెడ, నెడఁదను రిచ్చపాటుఁ జెందెడు కర్ణుం
గడు హెచ్చరించి యభిమ
న్యుఁడె జ్ఞప్తికిఁ దెచ్చుచుండె నొండు శరంబున్

సంజ— అంతియేకాదు— దుర్యోధన ప్రేరితులయి శత్రుంజయ, చంద్రకేతు, సువర్చన, సూర్యభాను, మేఘవేగు లతివేగంబపోయి కర్ణునకు బాపటగాఁ దాఁకి యఖండ శరవర్షము గురియ, నైదు క్రూర నారాచంబుల నైదుగురి కంఠంబులం దుంచి, యాసందున నొవ్వఁజేసిన కర్ణుని జర్జరిత శరీరుం జేసి సాగనంపి, కర్ణికలోఁ బ్రవేశించుచున్నాఁడు కనుము!

వైశం— కర్ణదుర్యోధను లిరువురుఁ బాదచారులై యెందులకుఁ జెపుమా యిటు వచ్చుచున్నారు?

(అంతటఁ గర్ణ దుర్యోధనులు ప్రవేశింతురు.)

దుర్యో— మిత్రమా!

చ. పలుచవడెం బలంబు బహుభంగుల!— మొగ్గర మంతయు న్నవం
బులకు నిధానమై, రుధిరపూరిత మై కనుపట్టుచుండె!— బె

ఱ్బులిఁ బొడగన్న లేళ్లగమి పోలిక సైన్యము లెల్ల విచ్చి వి
చ్చలవిడిఁ బాఱఁజొచ్చె!—నిఁక సాధన మేమియు లేదె దీనికిన్?

కర్ణు—మహారాజ! వీఁ డర్జునునికంటె నసాధ్యుఁడని మొదటనే చెప్పి
యుంటని గదా? అమీఁద, నాచార్యుఁ డేమేని పూనుకొనునేమో
యని చూచుచున్నాను.

దుర్యో—మిత్రమా! యేమి నీ కీవెఱ్ఱి! ఆచార్యున కాపాటి సహాను
భూతియె యున్నయెడల వీఁడు మొగ్గరమునఁ గాలు పెట్టఁ
గలఁడా! సైంధవుఁ డిందాఁక దైవమువలె నడ్డుపడకయున్న నీపా
టి కేమి కావలసినదో! (ముందునకుఁజూచి) ఎవ రావచ్చువారు?

కర్ణు—సింధురాజే—

దుర్యో—బావా! రమ్ము, రమ్ము—ఈపూఁట నీవలన మర్యాద
దక్కినది. ఆమాటయే యిప్పు డంగరాజుతో ననుచుంటిని.

సైం—(గర్వముతోఁ బ్రవేశించి) ఎక్కడి కేఁగిన నిదియే మాట—
ఎరినిఁ జూచిన నిదియే మాట! సరికాని—యీ బాలయమునిం
బరిమార్చుట కేమయిన దారి దొరకినదా?

దుర్యో—అదియే యాలోచించుచున్నాము—

సైంధ—అట్లయిన, నే నందులకే నీకొఱకు వెదకులాడుచు వచ్చినాఁ
డను. ఏదో మాటలసందర్భములో-నింటినుండి యుల్కగాలినట్లు
ఆచార్యుని నోటనుండి యొకరహస్యముజారి బయటఁ బడ, దానిని
నాల్కకుఁ దగిలించుకొని చక్కవచ్చితిని.

దుర్యో—(ఆత్రముతో) బావా! చెప్పు, చెప్పు!—ఏమది?

సైం—వీనికిఁ గవచధారణ మనువిద్య తెలియునఁట: అందువల్ల
రథ తురగ సూత కార్ముకముల నేకకాలమునఁ దునిమి, నేలకుఁ
దెచ్చి, చీకాకు పఱిచినం గాని వీనిం జంపుటకు సాధ్యపడ దఁట.

దుర్యో- .మేలు! బావా, మేలు! మంచిసమాచారము తెచ్చితివి!

(సందేహముతో) సరికాని—ఏకకాలమున నిన్నికార్యము లెవ్వరు చేయఁగలరు?

కర్ణు—అన్ని కార్యములు నొక్కరిచే నగుట యసంభవమే. సమర్థులు నలుగురు నాలుగుకార్యములం బంచుకొనవలెను.

దుర్యో—అది బాగుగనే యున్నది కాని—నాలుగిటిలో కార్ముక ఖండనము. *సింహఘంటా న్యాయమువంటిది!

కర్ణు—అది నిజమే కాని—దాని నెట్లో నేను నిర్వహించెదను: కడమవానిసంగతి చూడుము.

దుర్యో—అట్లయినఁ, గడమవానికిఁ దగునేర్పాటు నేను జేయఁగలను.

కర్ణు—ఇంకొకటి చాలఁ బ్రముఖ్యము! ఈలోపల ఘటోత్కచుఁడు మరల రాకుండఁ జూడవలెను.

దుర్యో—ఆసందియ మక్కఱలేదు. వాని నంతరిక్షమున నిరోధించుటకై మన యలంబసుని సమస్తపరివారముతో నిదివఱకే నియోగించి యున్నాఁడను. ఇఁక నాలస్య మెందులకు- పొద్దుగూడఁ గ్రుంకవచ్చుచున్నది-పోవుదము రండు. (అని ముందు నడచును.)

సైంధ—(తనలో) సుభద్రకుఁ బుత్రశోకము గలిగించినం గాని నీ ముఖము చూడ నని కదా నాప్రియురాలు పట్టు పట్టినది!—ఈ యత్నము కొనసాగినచో అభిమన్యుఁడు నావల్లఁ జచ్చినట్లే లెక్క. ఆమీఁద, నానందడిలో, నేనుగూడ నేమయిన రవంత చేయఁగలిగితి నా- యిఁకఁ జెప్పనక్కరయే లేదు! (అని నిష్క్రమించును.)

కర్ణు—మొదట దూరదృష్టి లేక యీరాజునకుఁ దను మనః ప్రాణములను ధారవోయుటంజేసి యిప్పు డింతటి దుష్కార్యమునకుఁ బూనికొనవలసి వచ్చినది! (పయికిఁ జూచి) ఓ యభిమన్యుఁడా! లోకములో నీవొక్కఁడవే వీరుఁడవు! ఏమన?—కర్ణునిచేఁ గూడ వీరజనవిరుద్ధమగు మార్గమును దొక్కించుచుంటివి కనుక! ఓ ధనంజయా! లోకములో నీ వొక్కఁడవే ధన్యుఁడవు! ఏమన?—

* సింహము మెడలోని గంటను విప్పుట వంటిది.

అభిమన్యునకుఁ దండ్రి వగుటచేత ! సందియ మేమి !—

చ. తనతనయుం గుఱించి యెడఁదం గరువంబును బొందుభాగ్య మె
వ్వనికి లభించు—నాత్మజుని పాభివ రూప వివేక వీర్య వ
ర్తనములచేత నెవ్వఁడు పరాజనా మందు—సుఖింపఁ గాంచునం
దనుని యశంబునం దెవఁ డతండె కృతార్థుఁ! డతండె తండ్రియున్!
(అని నిష్క్రమించును;)

సంజ—మిత్రమ! దుర్యోధనుని యాత్రమునుబట్టి యేదో క్రొత్తపన్ను
గడమీఁదఁ జనుచున్నట్లు తోఁచుచున్నది. అదిగో !—అచ్చటఁ
గృప కృతవర్మ సోమదత్త బాహ్లిక భూరిశ్రవ శ్శల శల్య శకుని
దుశ్శాసనాదులం జోఁవుచేసి వారితో నేమో మంతన మా
డుచున్నాఁడు! ఎందులకోకాని. యందఱుఁ దల లెగుర వేయు
చున్నారు. అదిగో, దుర్యోధనుఁ డందఱను వెంటఁగొని యభిమ
న్యుఁ డున్న దెస కరుగుచు, బలములవంకఁ జేయి వీచుచున్నాఁ
డు! పాపము!—చేతికట్టు మరల సడలినదికావలయును—అభిమ
న్యుఁడు విల్లు క్రింద నిడి దానిని సవరించుకొనుచు వీరిరాకఁ జూ
చి చరాలున మగుడ విల్లందుకొని యేమో యనుచున్నాఁడు !

తెరలో—ఓ కర్ణ దుర్యోధన కృప కృతవర్మ శల్యప్రభృతులారా !

ఉ. చిల్లరమూకలం బొదివి చీలిచి పీనుఁగుపెంట సేయఁగా
న్నొల్లకయున్న వీకరము లూడనిబాడక యింకనైనఁ, జే
విల్లు ధరించినందులకు వీరులరై కడదాఁక నిల్చి, మీ
తల్లులు వీరమాతలుగ ధాత్రి విరాజిలఁ జేయఁ గల్గుఁడీ!

సంజ—చూడు, చూడు;—అతనిపలుకులు ములుకులవలె నాటినవి
కావలయును— అంద ఱొక్క పెట్టున సింహనాదంబులతో నతనిం
బొదివి, పరశు పట్టిస ముసల ముద్గర తోమర భిండివాలా ద్యనే
కాయుధంబులు బోరునఁ గురియుచుండ—వారియొండ చూచుకొ
ని యచ్చటిబల మంతయుఁ * పిపీలికా పన్నగ న్యాయముగా-నత
నిం జుట్టుముట్టుచున్నది!

* చలిచీమలు పామును జుట్టుకొనినట్లు

సంజ — కాని, యాతఁడు మందహాస సుందరవదనారవిందుఁడై, రివ్వు రివ్వున వజ్రిసన్నిభములగు వాలుటమ్ములు రువ్వి — *ఖలేకపోత న్యాయముగా — నెల్లవారు నెగిరిపోవుచుండ నేమో యనుచున్నాఁడు వినుము.

తెరలో — ఓ పిఱికిపందలారా!

ఉ. ఆఱడివోని పౌరుషమె యాభరణంబుగ నెంచునట్టి స
ద్భారతజాతికెల్లఁ దలవంపు ఘటిల్లఁగ మీర లీక్రియ
బాఱఁగ వచ్చునే! పిఱికిపందలు చచ్చుచునుందు రెన్నియో
సారులు; ధైర్యశాలురకుఁ జావొకయప్పుడు మాత్రమే సుఁడీ!

వైశం — ఆమాటలకు రోషమువచ్చి దుర్యోధనుఁ డదిగో యెల్లవారి మీఁదను గటకట పడి, గజసైన్య మొకవైపునను, దురంగసైన్య మొకవైపునను ముట్టడింప నియోగించి, మహారథుల నండ అను వెంటఁ గొని తాను బురోభాగమునం దలపడుచున్నాఁడు.

సంజ — సరి కాని — కర్ణుఁడు నొచ్చిన ట్లభినయించుచు, వెఱచినట్లు నటించుచు, కనుక కొదిగి, తక్కుచుఁ దూరుచు, నాదంతావళములచాటునుండి యెందులకో యభిమన్యుని వెనుకకుఁ బోవుచున్నాఁడు చూచితివా?

వైశం — అవు నవును; అతనివరుస చూడ సందేహాస్పదముగనే యున్నది!...అమ్మయ్యో! యేదో దురాలోచన జరిగినది! అటు చూచి, యిటు చూచి, చివర కా కరికళేబరముల పొంత నిలిచి, శరము సంధించి, యదిగో! — యీవలివారి కేమో సంజ్ఞ చేయుచున్నాఁడు! —

సంజ — హా! యెంతదారుణ మెంతదారుణము!

గీ. కార్ముకముఁ ద్రుంచెఁ గర్ణుఁడు! — కదిసి హరులఁ
జంపె శల్యుఁడు! — సూతునిఁ జంపెఁ గృపుఁడు!
కురుపతియుఁ దమ్ములుం దేరు విరియ నేసి!
రొక్కమాఱుగ — రణధర్మ ముజ్జగించి!

* కళ్ళములో వ్రాలిన పావురము లన్నియు నొక్కసారిగ నెగిరిపోవునట్లు

వైశం — ఓరోరి దుష్టులారా! అందఱుం గూడి చేసిన యాలోచన మిదియా! — చీ! చీ! — నిరాయుధుండై యున్నవానిపై నట్లింకను నస్త్రశస్త్రములం గురియుటకు మీకు సిగ్గయిన లేదా! — సెబాసు! సింగపుం గొదమ యేస్థితియందును సింగపుం గొదమయే! ఆవిధముగ నందఱొక్కపెట్టున శరవర్షము గురియుచున్నను డీలుపడక, చివాలునం గరవాలముం గొని, కుప్పించి, గుప్పున నప్పరంబున కెగసి, వైనతేయునివలె వర్తించుచున్నాఁడు! ఓహోహో!

సీ. పటుతర రోష సంభరితమై యరుణ రా
జీవంబుగతి మోము జేవురింప
తుల లేని నెమ్మేని తూఁటులనుండి చి
క్కని వేఁడినల్ల చిల్లున స్రవింప
అనివార్యమగు చంద్రహాస విక్షేపంబు
గగనసీమను దటిద్గణము నింప
క్షితిఁ గంపిలం జేయు సింహనాదంబులు
దిక్సమూహమునఁ బ్రతిధ్వనింప
విభ్రమస్థితి మింటఁ బరిభ్రమించు
పార్థసుతుఁ గని, యేరిపైఁ బడునో యనెడు
భయముచే నెల్లవారును బయిరిఁ గన్న
బకముల ట్లొదుగుచు నున్నవారు కంటె!

సంజ — కాని, పాపాత్ముఁడు కర్ణుఁ డా కరవాలమును గూడ ఖండింప మరల నందఱు మగవారలై పుంఖానుపుంఖములుగా విశిఖములతనిపై గుప్పుచున్నారు!

వైశం — అయినను, నతఁ డించుకయు సరకుచేయక కర్ణుని రథముపై నుఱికి, చేతియందలి యఱకైదువుతో సారథిని నఱికి, — సిగ్గువిడిచి ధ్వజపీఠము క్రింద నొదిగిన కర్ణుని బెఱచిన వానింగాఁ దలంచి నేలకు లఘించి, తనయరదమునందలి చక్రముం గొని దట్టముగం దనపై శిలీముఖములం బరపు కృపునివంకకు నడచుచున్నాఁడు —

సంజ—ఔరా! ధర్మ మెంతద వ్వయినది! కర్ణ శల్య భూరిశ్రవ స్సోమదత్తులు నలువురును నలుదిశలం బొదివి; చక్రము తుత్తునియలు గావించి, శరవర్షముతో నతనిని ముంచియెత్తుచున్నారు! కటకటా! క్షణకాలముక్రిందటఁ జెక్కు చెదరక నిగనిగలాడుచుండిన కోమలశరీర మెంతలోఁ దూంట్లు పడి జల్లెడ యైనది!

సైశం—అట్టిస్థితిలోఁ గూడ నాతని శౌర్యధైర్యములు చూచితివా? కాలదండముంబోలు తన గదాదండముం గొని, తనపై గురియు శరవర్షము దానిచే నాచికొనుచుఁ, బిఱుఁగు గుట్టలమీఁదినుండి చెంగుచెంగున దాఁటుచుం జని, దురాలోకమగు నా రాజలోకము పైఁ దలపడుచున్నాఁడు!

సంజ—సరి కాని—రక్తపాతముచే మైకము గ్రమ్ముచున్నదా యేమి యట్లు తూలిపోవుచున్నాఁడు? అన్నన్నా! యీకిరాతు లిప్పుడు గూడఁ బాప! మతని నమ్ములతోఁ గ్రుమ్ముచునే యున్నవారు గదా! కాని, ముఖాముఖి నెదిర్చుట కిప్పుడు సైత మొక్కరికిని ధైర్యము లేదు సుమా!

సైశం—నీమాటకు నిదర్శన మదిగో! అలఁ డావైపున నున్న రథములను నుగ్గునూచము గావించి, యిటు తిరుగ, దుర్యోధన దుశ్శాసన శకుని సైంధవ ప్రభృతు లొకరి నొకరుఁ ద్రోచికొనుచు నీ వంకకుఁ బరువిడి వచ్చుచున్నారు! అతఁడును నంతటితో విడువక వెన్నంటి వచ్చుచునే యున్నాఁడుగాని—పాపము-బలహీనతచేఁ గావలయును బరుగిడ లేకున్నాఁడు!

[దుర్యోధనప్రభృతులు తెరఁ జిమ్ముకొని ప్రవేశించి నిష్క్రమింతురు.]

అభి—(అంతట రక్తసిక్తాంగుఁడై, గదాదండముతో రొజుచుఁ దూలుచుఁ బ్రవేశించి) ఓరోరి!...ఓరోరి! పాఱుఁబోతులారా!..విక్రమముతోడిపాటు...మీకు...మీకు...వివేకముకూడ లేదేమి!

గీ. కాయమా—మన్ను!...ప్రాణమా—గాలి!...వాని
కొఱకు...,మర్యాద...నిటు...మాపుకొనెద రేల!

పౌరుష...జ్ఞాన...కీర్తులం...బరఁగు వాని
జన్మ... మొకలి ప్తసే...పైనఁజాలుఁ గాదె!

(పరికించి) చీచీ! సిగ్గు విడిచి...కౌరవేశ్వరుఁడుకూడ ...కాలికొలఁది పరుగిడుచున్నాఁడే! (చేయెత్తి) ఓకురుకులపాంసనా!

ఉ. రోసము వాసి...పౌరుషము రోసి...తొలంగెద విట్లు మూతిపై
మీసము లేదె!...పాటిన నమిత్రులు మిత్రులు గూడ నవ్వరే!
వాసిగలట్టి...యీ భరతవర్షమునం దెపుడైన...నిట్టిస
న్యాసులు పుట్టిరే! కటకటా! కలికిం దొలిచూలి పట్టివే!

(పరికించి) ఏమి?-నాపలుకులు... చెవుల కెక్కనే లేదా! మంచిది, యెంతదూరము పోఁగలరో పొందు చూచెదను? (అని బిఱబిఱఁ జనఁబోయి ముందునకుఁబడి, మరలమెల్లఁగ లేచి)చీచీ! యీపాడుశవములు మాటిమాటి కడ్డు వచ్చి మార్గావరోధము కలిగించుచున్నవి!...(పశ్చాత్తాపముతో) అన్నన్నా! యేమంటిని?...పాడుశవము లనియా?—యెంతయుపచారము!...యశము నెడఁ బ్రేమ, యవమానము నెడ లజ్జ, లేక యీ పాఱెడునవి పాడుశవములు గాని—ప్రాణ మున్నంతవఱకుఁబోరి రణముభూమి నలంకరించిన యివి పాడుశవము లెట్లగును!...(మరలఁ బరికించి) ఆపిఱికిపంద లింతలో నేమయియుందురు!...చీ! చీ!—యట్టి పాఱుఁబోతులతో నేమిపని! (అని వెనుకకుఁ దిరిగి పరిక్రమించి) ఏమిచెపుమా భూమి యంతయు గిరగిర తిరుగుచున్నది!...అంతియే కాదు—నోరెండుచున్నది—కాళ్ళు తడఁబడుచున్నవి—కన్నులు—కన్నులు—ఇపు డన్నమాట యేమిటి?—కవచమా? ఎవరుచెపుమా నన్నుఁ బిలుచుచున్నారు! (అట్టిటుచూచి) ఓరీ—యెవ్వరును లేరే!...ఇప్పుడు నే నెచ్చట నున్నాను? ...అవు నవును—పద్మవ్యూహము. అట్లయిన, సారథ మేది?— నావిల్లేది? ...అన్న ట్లాపిఱికిపంద లధర్మముగా నన్ను విరథుం జేసి, యిహపరముల రెంటిని జెఱచుకొనిరి కదా! పోనిమ్ము. నా కీ గదా

దండమే చాలును. కాని—యెడమచేయి వలనఁదప్పియుండుటచేత దీని నీదక్షిణబాహు వొక్కటియే భరింపవలసి వచ్చినందులకు నాకుఁ జాల విచారముగా నున్నది! పైగా—నెత్తుటిచేఁ దడిసి యిది మాటిమాటికి జారిపోవుటకూడ సంభవించుచున్నది! సరి కాని—యీరక్త మంతయు నాదా,- లేక శత్రువులదా?—నాది యె యైనచో నాయదృష్ట మెంతనవచ్చును! ఏల యన,—

గీ. ఎవ్వఁడు స్వరాజ్యమునిమిత్త మెన్నిరక్త
బిందువులు ప్రీతి వసుధ కర్పింపఁగలుగు-
వాఁడు భూలోకమున నన్ని వర్షశతము
లమరుఁడై యుండు కీర్తికాయంబుతోడ!

(వికటు నభినయించుచు) ఏమి చెపుమా యీ కలకలము? (పరికించి రౌద్రముగా) ఓరీ కురుకులకలంకా! మరల నెట్లో యీ వైపునకుఁ జేరికొని, మొఱ్ఱోచచ్చితిమనువారికిఁ బౌరుషమెక్కించి నామీఁదికిఁ బురికొల్పుచుంటివా! పాపము!—వారి నేలబాధించెదవు! నేనే యటు వచ్చెదలెమ్ము. (అని తూలుచు నిష్క్రమిం.)

వైశం—అన్నన్నా! పాపము!—పోవుచుఁ బోవుచు వానెత్తుటిరొంపిలోఁ గాలు జారి మరలఁ జాపచుట్టుగ నేలఁ గూలినాఁడు!—కటకటా! యీసారి లేచుటకుఁగూడ శక్తి లేక ప్రాకులాడుచున్నాఁడు! అరెరే! * జంఘాణములుఁకూడ జారిపోయినవి! ఓరోరిపాపాత్ములారా! యెందుల కట్లుపరువిడి వచ్చుచున్నారు!—అందఱొక్కమాఱుగ మీఁదఁబడి మోదవలెననియా యేమి? ఆఁ! లేచెను!

సంజ—లేచుటయే కాదు,—గదాదండము గిరగిరఁ ద్రిప్పి—

గీ. కర్ణుఁ బడమోదె! శల్యుని గాడనేసె!
రాజును దెరల్చెఁ గృపుని సారథినిఁ గూల్చె!
అడరు దుశ్శాసను నదల్చె! నతనిసుతుఁడు
విల్లువీగుచుఁ దలపడ విరథుఁ జేసె!

* పిక్కలకుఁ దొడిగికొను కవచము.

వైశం—కాని, యీదాశ్యానని యంతటం బోక, తానును గదాధారి యై యతనిం దలపడుచున్నాఁడు. ఓహో! నెత్తుటిరొంపిలోఁ గాళ్ళు గుచ్చుకొని పోవుచున్నను, బిగిలబిట్టవలె నిరువురు నెంత చాకచక్యముగఁ బోరుచున్నారు!...అబ్బబ్బా! యిద్దఱిశరీరములును బొట్టుపండ్లవలె వీరిల రక్తప్రవాహముతో మాంసపుముద్దలు గూడఁ గొట్టుకొని వచ్చుచున్నవి!...ఓహో! కన్నులు కానరాకున్నను, జేతులయందుఁ జేవ లేకున్నను పౌరుషము వారిని మరలమరల డీకొలుపుచున్నది!...హా! యెంతబీభత్స మెంతబీభత్సము!...ఆ!—చచ్చె—దుశ్శాసనకుమారుఁడు చచ్చె!

సంజ—అయ్యో! అయ్యో! ఆదారుణము చూడవేమి;—

గీ. నెత్తుటం జొత్తిలుట జారి నేలఁ బడిన
తన గదాదండమునకు నై తడవులాడు
సమయమున- సైంధవుఁడు, శల్యు చాటునుండి
కుంతమున గ్రుచ్చి యభిమన్యుఁ గూలఁ ద్రోసె!

వైశం—ఓరోరీ వీరంమన్యులారా! యెందుల కా కోలాహలము!— ఇందఱుకూడి చేసిన యీఘనకార్యమున కేనా-యీసంతోషము! ఛీ! ఛీ!—సంజయా! లెమ్ము! మన మిఁక నిచ్చట నుండరాదు! (అని సంజయునితోఁ జెట్టు దిగి) ఓమహావీరుఁడా! నీవు నిర్వహించిన వీరవ్రత మనన్యసామాన్య మైనది! నేఁ డీసేనలో నీచే దెబ్బతినని వాఁడును—నీ కోడని వాఁడును లేఁడు! (భూమివంకఁ జూచి)

మ. అభయస్ఫూర్తి వహించి, యెన్నఁడును నన్యాక్రాంతిదుఃఖంబు లేక, భృశమైత్రిన యశమ్ముతో సకలసౌఖ్య ప్రాభవ శ్రీలతో నభివృద్ధిన్ వహియింపఁ గోరునెడ నార్యావర్తమా! తప్ప కీ వభిమన్యుప్రతిమాను లౌసుతులనే యశ్రాంతముం గాంచుమా!

(ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.

# చూళిక

## ( తెరలోపల )

ద్విపద, కటకటా! పుత్త్రశోకమ! నీదుశక్తి
పటుతరం బని తేటపడియెను నేఁడు!
కార్చిచ్చు వనములఁ గాల్చురీతిఁ
బేర్చి మానసముల నేర్చ నేర్తువు!
సడిలేని యుప్పెన చందంబుగాను
కడుపు సముద్రంబుఁ గావింపఁ గలవు!
సుడిగాలి నౌకను సుడిపెట్టు భంగి
నుడుగక ధృతిఁ బట్టి యూఁపఁ జాలుదువు!
కాకున్న నడవులఁ గష్టంబు లెల్ల
నేకమై యరికట్టి యెదురునాఁ డేని;
విరటునికడ మాఱు వేషముల్ తాల్చి
కరము హీనస్థితిఁ గడపునాఁ డేని;
తలఁకని పాండురాట్ తనయుల నేఁడు
కంది దుఃఖార్తులఁ గావింపఁ గలిగె!
బేల యైనసుభద్ర పెనుమూర్ఛ కేమి,
గోఁయా సుత్తర గోలకు నేమి,
కడుధీరుఁ డని పేరుఁ గన్న యర్జునునిఁ
బిడగు పడ్డము గావింపఁ జాలితివి!
దరినుండి కృష్ణుఁడు దైవంబువోలె
సరగఁ బ్రబోధంబు సలుపక యున్న-
వడముడి తనయుని వలన నాతనికిఁ
గోడును విభ్రమము నూకొనఁగ నబ్బెనునె!

ఇది చూళిక.

# పద్యవ్యూహము.

## పంచమాంకము,

రంగము.—పాండవుల సభా శిబిరము.

[కృష్ణ యుధిష్ఠిర భీమార్జున ఘటోత్కచ ప్రభృతులును,
ఉత్తర సుభద్రా ద్రౌపదులును, దుఃఖచిహ్నములతోఁ బ్రవేశింతురు.]

కృష్ణ—తరువాతఁ, దరువాత ?

ఘటో—తరువాత నింకే మున్నది !—

సీ. దుర్నిరీక్షస్థితిఁ దులకించి తులకించి
చరమాద్రిఁ గ్రుంకు భాస్కరునిభంగిఁ
గాననంబులు బూదిగాఁ గాల్చి కాలిచి
చల్లారు దావ కృశానుమాడ్కి
వడివడి పడగండ్లు వర్షించి వర్షించి
ధవళీమఁ గను జలదంబు పోల్కి
గగనంబు నొఱసెడు గతిఁ బొంగి పొంగి చ
ప్పనఁ జప్పఁ బడిన యంబోధి కరణిఁ
దన్నుఁ బొదివి శస్త్రతతులను మే నెల్లఁ
దూఁటు పఱుచు నట్టి దుష్ట రిపుల
కలఁచి కలఁచి, తుముగు కావించి కావించి
తమ్ముఁ డకట ! తుదకు ధరణి కొఱఁగె !

అందఱు—(ఒక్కపెట్టున) హా ! యసహాయశూర !—హా ! జగదేక వీరా ! (అని యాక్రందనము చేయుదురు.)

యుధి—హా ! తండ్రి !—యెంత దైవదుర్విపాకము సంభవించినది !

సీ. పూప ప్రాయము నాఁడె పొలసుదిండులఁ జంపు
మెఱపడి గలవాఁడు మేనమామ

బలిమి జరాసంధుఁ బట్టి రెండుగఁ జీల్చి
పేరు గాంచినవాఁడు పెద్దతండ్రి
ఫాలాక్షు నోడించి పాశుపతం బంది
గణుతి కెక్కినవాఁడు కన్నతండ్రి
నిజభుజశక్తి దిగ్విజయంబుఁ గావించి
వన్నె మీఁటినవారు పిన్నతండ్రు
లిందఱం గల్గియుండి, యొక్కింతపాటి
దైవకృప లేకయుంట నోతండ్రి! యిట్లు
దిక్కుమాలిన వాఁడనై చిక్కుపడితె
పగఱ చేతుల నన్నుఁ గాపాడ వచ్చి!

కృష్ణు— బావగారు! సర్వజ్ఞుల రగు మీరే యిట్లు మాటిమాటికి దుః ఖమున కెడ మొసఁగిన-నిఁకఁ దక్కినవారి గతి యేమి?

భీము—అబ్బాయి! సరి కాని—నీవు పోయి యేమి చేసితివి?

ఘటో—ఏమి చేయుటకును నెవ రున్నారు!—అప్పటి కప్పుడే సమర ము చాలించి యెల్లవారును శిబిరములం జేరికొనిరి.

భీము—(కోపముతో) శిబిరములలోఁ బ్రవేశించి సిగలు పట్టియీవలి కీడ్చుకొని వచ్చుటకు భయపడితివా?

ఘటో—తండ్రీ! మన్నింపుము!—నేను భయపడినమాట నిజమే కాని, శత్రువులకుఁ గాదు-ధర్మలోభులగు పెదనాయనగారికి—

యుధి—నిజమే నాయనా—నిజమే! నాధర్మలోభమే యింత చేసినది!

చ. ఖలుల నధర్మవర్తనులఁ గర్ణ సుయోధన దుస్ససేనులం
బలిగొను బుద్ధికున్ శకునపక్షి విధంబున నడ్డు వోయి నేఁ
దెలుపకయున్నఁ దండ్రిల ప్రతిజ్ఞల సంగతి, యిట్టిచెట్ట రాఁ
గలుగుట కించు కేనియును గారణ మున్నదె నిశ్చయంబుగాన్!

భీము—(విషాదముతో) హా! తండ్రీ! యిదిహాడనా!—

గీ. తండ్రుల ప్రతిజ్ఞలకు హాని తారసిల్లు
ననుతలంపునఁ జిక్కునఁయదుల విడిచి

నిన్నుఁ గట్టంగఁ దాళ్ళను నీవ తెచ్చు
కొన్నవాఁడ వటోయి! మూర్ఖులకుఁ దండ్రి!

(ఆకసమువంకఁ దృష్టి నిగిడ్చి) ఓరోరి కౌరవకులాపశదులారా!

ఉ. బాలకు, నొంటిగాని, జెయి వాటముఁ దప్పినవాని, పాడిపై
మాలిమి మిన్నులం దునుమ మానినవాని, నిటందఱేకమై
కూలిచి కేకచుంటి రిది గుండెలలో నిడికొందు! మీతలల్
కాలను దన్నుచుం దివికిఁ గందుక కేళి యొనర్చి తీఱెదన్!

కృష్ణు — ఈశపథము తథాస్తు దేవత లాలకింతురు గాక!

అర్జు — (నిట్టూర్పుతో) బావా! వారి ననవలసిన పని యేమున్నది!

ఉ. తాత యవక్రవిక్రమముఁ, దండ్రిల ధర్మపరాయణత్వమున్
మాతల రూపవైభవము, మామల యద్భుత బుద్ధిపాటవం
బాతతభంగి నిచ్చి- యిటు లాయువు తక్కువ చేసినట్టి యా
ధాత యొకండె నింద్యుఁ! డిఁకఁ దక్కినవారు నిమిత్తమాత్రకుల్.

ఇంతకును —

ఉ. చక్కని రూప సంపద, ప్రశస్త తరంబగు వర్తనంబు, పెం
పెక్కిన బుద్ధి, నిచ్చలు రహించెడు తెల్వి, వరించి తాముగా
నెక్కొనినట్టి విద్యలు, త్రినేత్రుని సైత మెదిర్చు సాహసం-
బక్కట! మందభాగ్యులకు నట్టితనూభవుఁ డెట్లు దక్కెడున్!

కృష్ణు — ఫల్గునా! నీ వన్నమాట నిక్కువము.

గీ: మానవుఁడు చెట్టునందలి మంచిఫలము
వెదకి మఱి కోసికొనియెడి విధముగాను!
మంచివారిని, గులముద్ధరించువారి,
నెంచి మఱి మిత్తి తాఁ గబళించుచుండు!

ఉత్త — (శోకముతో) హా! ప్రాణేశ్వరా! హా! హృదయేశ్వరా!

సీ. మన పెండ్లి కొఱకు వేసిన పచ్చి పచ్చాకు
పందిళు లింక విప్పంగ లేదు

మన పెండ్లి చూడ వచ్చిన బంధుతతి తమ
సీమల నింకను జేర లేదు
మనము ధరించిన మధుపర్కముల హారి
ద్రవర్ణ మింకను దరుగ లేదు
మన మొండొరుల సిగ్గు మాని పూర్తిగఁ గనుల్
తనియ నింకను జూచుకొనఁగ లేదు
ఇంతలోపలనే మది నింత జాలి
మాలి, లేజవరాలిఁ, జూలాలి, నాలి
నిట్లు విడనాడి యెటఁగ నేఁగఁ దగునె!
చిత్రసంభవ సంకాశ! జీవితేశ!

చ. కవచము మేని, కంజనము కన్నులకున్, శ్రుతిలీనగాన మీ
చెవుల, కభీప్సితార్థ ఫలసిద్ధి మనంబునకున్, మనోజ్ఞమా
చవి రసకుం, బ్రయోజనము సంజననంబున, కారయం ద్వదీ
య విమల సన్నిధాన ; మనఘా! యది లేని ప్రపంచ మేటికిన్!

ద్రౌప—బిడ్డా! యోర్చుకొమ్మోర్చుకొమ్మమ్మ! నీదుఃఖమును మాదుః
ఖమును నీకడుపులోని బిడ్డ తీర్చవలెను. ఆబిడ్డ సేమముకొఱకు
నీవు దుఃఖమును దిగమ్రింగక తప్పదు.

కృష్ణ—అమ్మాయి! నీవు చిన్నదానవైనను బుద్ధిమంతురాలవు
కనుకఁ జెప్పుచున్నాఁడను- పోయినవారికొఱకు దుఃఖించుటకంటె
వెఱ్ఱితనము మఱి లేదు. ఏమందువా ?—

గీ. వసుధఁ జావువుం బోలెఁ దప్పనియదియును;
ప్రకృతిసిద్ధమైనదియును ; బ్రాణికోటి
కెల్ల సామాన్యమై తారసిల్లు నదియు
నింకొకటి లేదు- దానికై యేల వగవ ?

ద్రౌప—అయ్యో! అయ్యో!—సుభద్రకు మరల మూర్ఛ గ్రమ్ము
చున్నది!——(అని తొట్రుపాటుతో లేచి సుభద్రను బట్టుకొనును)

కృష్ణు—అమ్మాయి! అంతటితో నూరకొంటి వేమి?—సురల నా
ప్రాబోధినీరసము గొంచెము మొగముపైఁ జల్లుము!—

ద్రౌప—(అట్లు చేయును.)

సుభ—(క్రమముగాఁ దెలివిఁ గొని) హా! కుమారా, హా! జగ
న్మోహనాకార!

సీ. అవయవంబులుగల యబ్జారి వడపునఁ
గనువిందు సల్పు నిన్నన్న నాఁడు
చూచినవా రెల్ల సురనాథు నంతవాఁ
డగునమ్మ నీకొడు కన్న నాఁడు
విలువిద్యలో యదువీరుల మించి నా
యన్నలచే మెప్పుఁ గన్న నాఁడు
ఉత్తర కేల్గొని యొగి బ్రహ్మ ముడితోడ
భక్తిమై నను మ్రొక్క వచ్చు నాఁడు
కటకటా! నేను బొందిన గర్వమెల్ల
నేఁడు నిమునంబు లోపల నేలఁ గలిసె!
ఎట్లు నలువురిలోఁ దల యెత్తికొందు!
నీవు లేకుండ ద్వారక నెట్లు కందు!

కృష్ణు—చెల్లెలా! యేమి యజ్ఞాన మిది!—నీ కుమారునింగూర్చి
నీ విపుడు మఱింత గర్వపడవలసి యున్నది. ఏ మందువా?—

చ. గురు నవలీల నొంచి, మదుగుం జొరఁబాఱు మదేభ మట్లు మొ
గ్గరమునఁ జొచ్చి, శల్య శల కర్ణ కృపాదుల తాట యొల్చి, పె
క్కురథికులన్ వధించి, తనకుం బ్రతివీరుఁడు లేఁడనం దలో
దరి! విలసిల్లి నీసుతుఁడు ధన్యులఁ జేసెను మిమ్ము మమ్ములన్.

అదిగాక:—

చ. వరుస, స్వరాజ్య హర్తలగు వైరుల నెత్తుట నోల లాడి, సం
గరభువికిన్ శరీరమును గానుక వెట్టిన నీకుమారు న

చ్చరిత, వియచ్చరాంగనలు చాపవిపంచిక లూని జాహ్నవీ
పరిసర పుష్పవాటికలఁ బాడుచు నుందురు చూచె నిచ్చలున్.

అర్జు—(యుధిష్ఠిరునితో) అన్నగారు! నకుల సహదేవ విరాటాదుల కింకను స్తంభనాస్త్రమువలని మైకము వీడలే దనికదా యంటిరి?

యుధి—చంద్రోదయ మగునరికిఁ గాని వీడ దని వైద్యులు చెప్పిరి.

అర్జు—అట్లయిన మన కిచ్చట నీయాలస్య మెందులకు?- (ద్వారము వంకఁ జూచి) భద్రా! మేము బయలుదేరవచ్చునా?

తెరలో—స్వామీ! దేవర యాజ్ఞయె తడవుగాఁ గరదీపికలు సిద్ధము సేయఁబడినవి; గజతురగాదుల కళేబరములను దొలంగించి మార్గము సరిచేయఁబడినది! ద్వైపాయన హ్రదముకడకు బండ్లతో ఘృత చందనాదులు పంపఁబడినవి.

అర్జు—(చివాలున లేచి) అబ్బాయి! తమ్ముని కడకు దారి చూపుము.

ఘటో—దయచేయుఁడు—(అని ముందు నడచును.)

(అందఱు బయటికి వచ్చి దీపికా పురస్సరముగఁ బరిక్రమింతురు.)

*　*　*　*

భీము—అబ్బాయి! అఱవఱలైన యీ యరదంబుల గుట్టలును—ఖండఖండంబులైన యీ కరికళేబరంబుల మిట్టలును—అట్లయిన యీ యశ్వంబుల తిట్టలును—ఇంత యేల?—యీవిలయచిహ్నము లన్నియు నేఁటి వేనా?

ఘటో—అయ్యో! యిచ్చట నేమున్నది?—తమ్ముఁడు నేఁ డొనర్చిన మారణకర్మ చూడవలె నన్న నవ్వలి దెసకుఁ బోవలెను!

అందఱు—(నిట్టూర్పులు పుచ్చుచు నడతురు.)

*　*　*　*

ఘటో—మీ రిచ్చటఁ గొంచెము తొందరగా నడువవలెను. ఏమా?

సీ. నెత్తుటఁ జొత్తిల్లి యొత్తుగ మత్తిల్లి
యట్టిటు నేలఁ బొర్లాడు వారు

కాలు సేతులు తెగి యాలు బిడ్డలమీఁది
బుద్ధి నిట్టూర్పులు పుచ్చువారు
రక్తపంకిలమైన రణభూమిఁ జిల్లగి
ల్లిన బాహువులఁ గౌఁగలించువారు
కరికళేబరముల యిఱుకునఁ గూలి యె
మ్ములు పటపట లాడ మూల్గువారు
దప్పిచే నెండి నాలుక డొప్ప గాఁగఁ
దమిని దమరక్తమే పట్టి త్రావువారు;
మిపుల బీభత్సమై యుల్లు మిత్తి వంట
యింటవలె నున్న దీప్రాంత మేమి చెప్ప!

(అందఱుఁ గొంచెము వడిగా నడతురు.)

* * * *

ఘటో—తండ్రులారా! యిచ్చటి రథ గజ తురగ పదాతులయందు గ్రుచ్చుకొనిన బాణములు గ్రుచ్చుకొనినట్లే యుండి. యీప్రదేశమంతయు నమ్ములచేనుగాఁ దోఁపించుచున్నది చూచితివా!

కృష్ణు—అంతేకాదు—ప్రతిబాణమునందును బాబు నామాక్షరములతని కీర్తిచంద్రికలవలె జిలజిల మెఱయుచున్నవి!

అర్జు—(శోకముతో) హా! తండ్రీ! హా! లోకైకవీరా!

చ. కరమున దండపాశములు గ్రాలుట లేదు! త్రిశూల మేనియుం
బరఁగుట లేదు! చక్రమును బట్టినవాఁడవు గావు! వజ్రముం
బరశువు నైన లేవు! కడుబల్లిదులౌ విలుకాండ్రనెట్లు లిం
దఱఁ బడఁగూల్పఁ జాలితివొ దైవ మెంఱుగవలెం గుమారకా!

ఆ. వె. సవ్యసాచి యనెడు సంజ్ఞ మాత్రమె కాని
యిట్టి నేర్పుఱుంగ నిప్పటికిని,
కాంచి తెట్టులింత కరలాఘవము నీవు
పిన్న వయసు నాఁడె! కన్నతండ్రి!

యుధి—తమ్ముఁడా! యీమాట నీ వన నక్కఱ లేదు—నీవిరోధి యగు కర్ణుఁడే యన్నవాఁడు—

" చ. కనుఁగొనినాఁడ భార్గవు నఖండతరంబగు లక్ష్యశుద్ధి; నా
కనుభవవేద్యమే నరుని యద్భుత సాయక కర్కశత్వ; మ
తనికడ వారికిన్ యశము దక్కదు! చేతికిఁ గన్నులున్నవా
యన భ్రమఁ గొల్పు లక్ష్యమున; నాయములంటు శరంబు రువ్వినన్

అని యతఁడును ద్రోణునితో ననుచుండఁగా నేను స్వయముగా విన్నాఁడను.

భీము—హా కుమారా! మేము నీవియోగమునకు దుఃఖమొ పడమా!—నీపరాక్రమమునకు గర్వమొ పడమా!

గీ. మాగదలు, మాశరాసన మార్గణములు
కాల్పనే నీదుముందటఁ! గదనభూమి
మదపుటేనుఁగు జొచ్చిన మడుగుఁ బోలెఁ
జలుపఁ గంటిమె యిటు లొకసారి యేని!

ఘటో—తాళుఁడు, తాళుఁడు!—తమ్ముని చుట్టు నున్న శవములం దొలఁగింపఁ బోయినపరిచారకులు కాఁబోలు నేమో యనుచున్నారు!

అందఱు—(ఆపాటున నిలిచి యాలకింతురు.)

తెరలో—అయ్యా! శీఘ్రముగా రండు!—శీఘ్రముగా రండు!— బాబుగారి కింకను నూపిరి యున్నట్లున్నది!

అర్జు—ఏమీ! అంతపుణ్యమా!—బావా! బావా! రమ్ము రమ్ము!
(అని కృష్ణసహితముగా నిష్క్రమించును.)

యుధి—భగవంతుఁడా! యెంత చల్లనిమాట వినిపించితివి!—రండు వడిగా రండు (అని భీముఁడుతక్క దక్కినవారితో నిష్క్రమిం.)

భీము—(నిట్టూర్పుతో) ఆపరిచారకుల వెఱ్ఱికిని పేరిపిచ్చికిని సరిపోయినది! యెక్కడి యూపిరి!—యెక్కడి లోకము! ఈ యాశాభంగము వీరిని మఱింత కుందఁదీయును! మిన్ను విఱిగి మీఁద బడినను జలింపని నాహృదయ మిప్పటికే చాల వికల మయినది;

అక్కడికేఁగినచో వారితోపాటు నేనును శోకరసము క్రింద మాఁటు వలసినవాఁడ నగుదును! వారు శవమును దీసికొని యిటే కదా వత్తురు—అంతపర్యంతము నే నిచ్చటనే యుండెద. (వినుట నభినయించి) తమ్ముఁ డేమో యనుచున్న ట్లున్నదే?

తెరలో—తాళుఁడు!—తాళుఁడు!—బాబు పెదవుల నందునుండి యస్ఫుటముగ నేమో వినవచ్చుచున్నది—సందడి సేయకుఁడు!

భీము—ఏమీ! అట్లయిన బాబింకను జీవించి యున్నవాఁ డన్నమాటయే! అరరే!—వారితో వెళ్ళక యెంత వెఱ్ఱిపని చేసితిని! (అని సత్వరముగఁ గొంచెము నడచి, యంతలో నాఁగి) అదేమి! అంతలోనె మరల నంద ఱొక్కపెట్టున నాక్రందన మువక్రమించినారు! (ఆలోచించి) సరి, తెలిసినది—యేదోసంగతి తండ్రిచె విని వేయునిమిత్త మింతపఱకు నూపిరి నాలుకకొన నంటిపెట్టుకొని యుండి, యది తీఱఁగనే వెడలిపోయి యుండును!...అక్కట కటా! సుభద్రతోపాటు దిక్కులుకూడ వాపోవుచున్నవా యేమి చెపుమా—అంత గోలగా నున్నది!...(పరికించి) అయ్యయ్యో! ఉత్తర భర్తృశవముపైఁ బడి చేయునాక్రందనమునకు మేరుధీరు డగు కృష్ణుఁడు కూడ బెంబేలువడి ప్రతిమవలె నట్టె నిలుచున్నాఁడే!...సెబాసు పాంచాలీ! సెబాసు!—ధైర్యమునకు నీకడ మేము గడ్డిపోచకును మాఱము! అత్తకోడండ్రి నిరువురను జెఱియొక చంకను నిఱికించుకొని దూరమునకుఁ గొంపోయి శవమును గర్ణ రథమునఁ జేర్చుట కవకాశము కలిగించితివి!... ఓహో! ఘటోత్కచునకుఁ దమ్మునిపై నెంత ప్రేమ!—పరిజనమును నివారించి రథమును దానె నీడ్చుకొని వచ్చుచున్నాఁడు!

[అంతట ఘటోత్కచుఁడు కర్ణ రథము నీడ్చుకొని రాఁగాఁ గడమవారు రోదనము చేయుచుఁ బ్రవేశింతురు.]

ఉత్త—(శోకముతో) హా! ప్రాణేశ్వరా! హా జీవితేశ్వరా!

సీ. పుట్టింటి మీఁదను బుద్ధి పాఱకయుండ
నంతగాఁ జను విచ్చి యాదరించి
పాలమల్లె మోము నవ్వులకుఁ దిప్పఁగ నట్టె
గిలిగింత పెట్టి కౌఁగిటఁ గదించి
క్షణము కన్పడకున్న జగతీతలం బెల్లఁ
దలక్రిందు లైనట్లు తల్లడించి
యెడఁద నాదగు నడవడియెకఁ గలమెప్పు
దలనిద్రలోఁ గూడఁ బలువరించి
ఆఱు నెలలలోన నఱువ దేఁడుల ప్రేమ
గుత్త కిచ్చినట్లు గుమ్మరించి,
యేఁగి తయ్యొ వాని నెదలోన స్మరియించు
కొనుచుఁ గుళ్ళి చావు మని విధించి !

కృష్ణు—బిడ్డా ! నామాట వినవా ? నీవివేకమునకుఁ బ్రయోజన మిఁక నెప్పుడు ? (సుభద్ర నుద్దేశించి) అమ్మాయి ! నీవె యిట్లు పొక్కి పొక్కి పొగులుచున్న నీకోడలి నెవ్వ రోదార్పఁ గలరు ? మే మిఁక శీఘ్రముగాఁ బోవలెను;—మీ రిచ్చటనుండి మరలుఁడు.

సుభ—అయ్యో ! చిన్నన్నా ! నాతండ్రిని విడిచి నేను బోఁగలనా!

సీ. నవమాసములపాటు నాదుగర్భమున
నిశ్చింతతోఁ బెఱిగిన చిన్నిమేను
రుక్మిణీ సత్యల రుచిరంపుఁ గరముల
బంతిగా నాడిన పసిమిమేను
అతియోగ్యమైన నీ యంకతలంబును
గద్దియగాఁ గొన్న ముద్దు మేను
పూజ్యులౌ పాండురా ట్పుత్రుల కనులలో
నమృతంబుఁ గురిసిన యనుఁగుమేను
ఉత్తర కటాక్ష మాలిక లుత్త గొనెడు
భాగ్య మబ్బిన లేఁబరువంపు మేను

శివ శివా! యిట్టు లగ్గిసాల్సేయఁ బంపి
యెట్లు జీవింతు! నీశోక మెటు భరింతు!

తెరలో—అయ్యో! అయ్యో! పెద్దదాన నగుటంజేసి వడిగా నడిచి మిమ్ములను గలిసికొనలేకపోవుచున్నాను! నావయసుమీఁది కని కరముచేనైన నొకక్షణము నిలువుఁడు!

అందఱు—(అదరిపాటుతో వెనుకకుఁ దిరిగి చూతురు.)

కృష్ణు—ఎవతెచెపుమా యీ వృద్ధాంగన?... అవ్వా! తొందర లేదు, తొందరలేదు,—మెల్లఁగా రమ్ము, నీకొఱకు నిలిచినారము.

వృద్ధ—(గమనాయాసముచే రొజుచు సూఁతకోలతోఁ బ్రవేశించి) మాతండ్రి! మాతండ్రీ! యీముసలిదానిపై నెంత కనికరము చూపితివి!— (పరికించి) బాబు! నీవు శ్రీకృష్ణుఁడవు కావుగద?

కృష్ణు—అట్లే. నీ వెవ్వరిదానవు?

వృద్ధ—నేనా?—నేనా?— అయ్యో! యెవ్వరిదాన నని చెప్పుదును!—శరీరము కౌరవులది—హృదయము పాండవులది.

కృష్ణు—అట్లయినఁ గౌరవుల పోషణలో నున్నదాన వన్నమాట—

వృద్ధ—అన్నమాటే—నాకొడుకులు వారిపోషణలో నుండిరి.

కృష్ణు—మాతో నేమిపని గలిగి వచ్చితివి?

వృద్ధ—బాబు! మీతో నా కేమియుఁ బని లేదు. అభిమన్యుకుమారుఁడు నేఁడు చూపిన పరాక్రమము మా పిల్లవానివల్ల విని, యట్టి వీరశిరోమణిం గన్నతల్లి యెట్లుండునో యొకసారి చూచి పోవలె నని వచ్చితిని. కాని, నాయాశ వ్యర్థమైనది!—

కృష్ణు—కాలేదు—అదిగో!—ఆమెయే సుభద్ర (అని చూపును.)

వృద్ధ—(చూచి యనాదరముతో) ఏమి!—యీమె సుభద్రాదేవి యా!—బాబు! నాతో నెందులకుఁ గోడిగ మాడెదవు!— సుభద్రాదేవి కంటఁ దడిపెట్టునా!

కృష్ణు—అట్లయున్న, సంగతి నీవు చివరంట వినలే దన్నమాట—

వృద్ధ—విన కేమి ?— అంతయు విన్నాను. అగుఁగాక !— అంతమాత్రమున కాయమ్మ కన్ను చెమ్మగిల్లునా ! నిరంతరము దమకొఱ కెందఱు వీరశయనముఁ బొందుట లేదు ? వారు మాత్రము తమకు బిడ్డలు కారా ? వారిలో నొక్కరికొఱకును నిట్టూర్పైన విడువక —యీబిడ్డకొఱకు మాత్రము వాపోవునంతటి యవివేకమున కంతటి యిల్లాలు తా నొసఁగునా ? ఇంతకును, స్వధర్మము నిర్వహించి కృతకృత్యుఁడైన కుమారునిం గూర్చి గర్వపడుటకు మాఱుగ దుఃఖపడు రాచకూఁతు రెందేనిం గలదా బాబు !

కృష్ణు—దీనింబట్టి నీవు గర్భశోకముయొక్క వాడిమి యెఱుఁగనిదానవని స్పష్టపడుచున్నది !—

వృద్ధ—బాబూ ! ఆలాగుననా !—అట్లయిన, దయచేసి, నాసంగతి రవంత వినుము. నాకు నలుగురు కుమారులు, స్వామిఋణ విముక్తికొఱకు ముప్వురను యుద్ధమున కనిపి, నాలవవానిని నాసంరక్షణనిమిత్తము దగ్గఱనుంచుకొంటిని. యుద్ధమునకరిగిన ముప్వురును వీరశయనము నొందిరి. వారి మరణవార్త నేను సంతోషపూర్వకముగ నాలకించుట చూచి, యొద్దనున్న నాలవపిల్లవాఁడు—"అమ్మా! నాయన్నలు పోయినందులకు దుఃఖించుటకు మాఱుగ సంతసించుచుంటివే" యని నన్నడిగెను. "నాయనా ! నాకుమారులు వీరవృత్తిచేత స్వామిఋణము తీర్చి నన్ను వీరమాతను జేసినప్పుడు నాకు సంతోషము కాక మఱేమి" అని యుత్తర మొసఁగితిని. అంతట వాఁడు దిగ్గన లేచి, తన విల్లమ్ము లందికొని "అమ్మా ! అట్లయిన నాకుఁగూడ సెలవిమ్ము—నేనును వీరధర్మమును నెఱవేర్చి నిన్ను సంతోష పెట్టెదను." అని పలికెను. అంతట నేను మంచిది పోయి రమ్మని దీవించి పంపివేసితిని—

కృష్ణు—సెబాసు ! అదిగో !—అప్పుడు నీ గొప్పతనము !—

వృద్ధ—నాకోడండ్రిరువురుఁగూడ నట్లే యనిరి, కాని, నాకుమాత్రమం దేమియు విశేష మగపడ లేదు.

కృష్ణ—నీకుమారులలో నిరువురకు వివాహములు కూడ నైనవేమి ? కోడండ్రు మనోబలమునందు నీ కద్దియైన వారేనా ?

వృద్ధ—కాకున్న, వారిని గోడండ్రని చెప్పియే యుండను.

కృష్ణ—మేలు ! ఆ కడసారపుం బిల్లవాం డేమయినాండు ?

వృద్ధ—ఈపూంట వచ్చి తలుపు తట్టినాండు యుద్ధభూమినుండి పాఱి వచ్చినాం డను దలంపుచేతం దలుపు తెఱవక "పిఱికివాని కిచ్చుటం దావు లేదు పో" మ్మని నేను లోపలినుండియే కేక వేయంగా "అమ్మా ! నేను బఱచి రాలేదు, నీ కొఱకు యుద్ధవృత్తాంతము వినుచుటకై వచ్చినాండను." అని వాండు ప్రత్యుత్తర మొసంగెను. అంతటం దలుపు తెఱచి చూచితిని గదా—వాని కాయమంతయు గాయములతో నిండియుండెను. కాని వెనుకభాగమున నొక్క పోటయిన లేదు సుమా! అంతట లోపలికిం దోడుకొని పోయి నేను గాయములు కడిగి కట్లు కట్టుచుండంగా—వాండభిమన్యుకుమారుని వృత్తాంత మంతయుం బూసగ్రుచ్చినట్లు చెప్పెను. అప్పుడు నాకు సుభద్రాదేవిం జూడవలె నను కోరిక పుట్టినది. పిల్లవాండు నన్నింతవఱకుం దోడుకొని వచ్చి, మిమ్ములం జూపి, తాను కౌరవస్కంధావారమునకుం జక్కం బోయినాండు—

సుభ—(తటాలునం గౌంగిలించుకొని) తల్లీ ! నీవు ధైర్యలక్ష్మివి కాని—సామాన్యస్త్రీవి కావు ! భగవంతుండు నా దుఃఖోపశమనము నిమిత్తము నిన్నుం బంపి యుండవలెను !—

వృద్ధ—అట్లయిన, సుభద్రాదేవి నీవె యన్నమాట !—అమ్మా ! నీభాగ్యమే మనవచ్చును ! వీరపత్నీత్వ వీరమాతృత్వములు రెండును నీకు సిద్ధించినవి ! కాని, తల్లీ ! శోకమున కింకం జోటొసంగి నీకీర్తిని గొంచెపఱచుకొనకుము ! (ప్రక్కకుం జూచి) ఈమె ద్రౌపదీమహాదేవి కాదు గదా ?—కాకేమి ?— అదిగో ఆశిరోజములే చెప్పుచున్నవి ! (చేతులు మోడ్చి) తల్లీ ! యీ భరతవర్ష సామ్రాజ్య పట్టమహిషీత్వమునకు నీవె తగిన దానవు

ఎవఁడు నాతల ముట్టెనో వానితల తెగువఱకుఁ దలముడువ నని. యొకటి కాదు, రెండు కావు—పదమూఁడువర్షములనుండి వీడిన కురులతోడనేయున్న నీదీక్ష నెవ్వరు కొనియాడ కుండఁగలరు ! భరతమాత యెల్లవుడు నీవంటి మానవతులనే పడయుఁ గాత ! బిడ్డా ! నీవు మత్స్యరాజ తనూజాతవు కావలెను—తప్పుతప్పు !. నీవట్లు కంటఁ దడిపెట్టరాదు ! నీయదృష్టము చాలగొప్పది. నీకు మహావీరపత్నీత్వము సిద్ధించినది ! నీ కడుపులోని శిశువు మగబిడ్డయై నీకు మహావీరమాతృత్వముకూడ సిద్ధించుగాక నాకు సెలవు—

ద్రౌప—అవ్వా ! నీ వాక్యములు మాకుఁ గ్రొత్త జీవితమును ప్రసాదించినవి !—నిన్ను మేము విడువఁ జాలము—మాతోవచ్చి నీ జీవిత శేషము మాకడఁ గడపుము.

వృద్ధ—వల దమ్మా ! వలదు—మీరు మహారాజపత్నులరు. మీవంటివారి సన్నిధి నుండుటకుం దగిన యర్హత నాకు లేదు. ఇంతకును నాకుటీరమే నాకు స్వర్గము నాజీవితశేష మందే గడపఁ దగినది.

యుధి—అవ్వా ! నీపలుకులు వీరి దుఃఖమును జాలవఱకు నివారించినవి నీ సాన్నిధ్యమువలన శేషము కూడ నివారణ కాఁగలదు. కావున, దయచేసి, వీరితో శిబిరమువఱకైనఁ బొమ్మా.

వృద్ధ—అయ్యా ! నీవు యుధిష్ఠిర మహారాజవు కావలయును. అట్లయిన నీయాజ్ఞ నాకవిలంఘనీయము. ఏమన ? నీవు మాభవిష్యత్సార్వభౌముఁడవు. నడువుఁ డమ్మా నడువుఁడు—మిమ్ములను మీశిబిరములందుఁ బ్రవేశపెట్టి, నాదారిని నేను బోయెదను. (అని స్త్రీజనమును వెంటఁ గొని నిష్క్రమించును)

(అందఱుఁ బరిక్రమింతురు)

అర్జు—బావా ! యీమెమాటలు మంత్రమువలెనే మనస్సులను మార్చివేసినది—యేమి యీవింత !

కృష్ణ—అర్జునా ! స్త్రీలనగా నేమో తెలియునా !—

గీ. సకల విషయంబులును బోధ సలుపు గ్రంథ
ములు ; మనోవ్యాధి మాన్పెడు మూలికలు ; వి
చార వారాసి దాటింపఁ జాలు నౌక,
లంగనలు:—దైవ మిడు వారి కట్టి శక్తి.

అందును మన భరతవర్షమునందు—.

చ. వెనుకన మౌక్తికంబు, లటవీ తరుశాఖలయం దమూల్యమౌ
బదనిక, తెట్టులో యటులె-ప్రాకృతు లందును మేరుధీరలౌ
సనయుల చిత్తులౌ, సకల శక్తి సమేతులు కొ నెలంత లొ
ప్పిదముగఁ బుట్టుచుందు్రి, మహి పెంపు వహించును వారిచేతనే.

తెరలో—దేవా ! ఇటు, ఇటు!—సంస్కారసామగ్రి నిదిగో యీ సముప్రదేశమున సమకూర్చినారము.

కృష్ణు—ఘటోత్కచా! నీవు రథ మూపరిజన మున్నయెడకుఁ దీసికొని పొమ్ము. (యుధిష్ఠిరునితో) బావగారు! మీ రిచ్చట నిలువుఁడు. అర్జునా! నీవు ముందు స్నానము సేయవలెను గదా !—అదిగో రేవు—రమ్ము పోవుదము. (అని యర్జునుని వెంటఁగొని నిష్క్ర-)

(యుధిష్ఠిర భీములు కూరుచుందురు.)

తెరలో—హా ! పరమేశ్వరా !

చ. పొడమి తమంతవార లగు పుత్త్రిల చేతులలోనఁ బ్రాణముల్
విడుచు నదృష్ట మేరికి లభించునొ వారె యదృష్టవంతు, లి
వ్వాసుపునఁ జేయుచాలరఁ దనపాపనిఁ గాటికిఁ దార్చి చిచ్చు వె
ట్టెడు దురవస్థ యేనికి ఘటిల్లునొ వాఁ డతిపాపి ధాత్రిలోన్ !

యుధి—(పరికించి) కటాకటా ! యెంత కష్ట ! మెంత కష్టము !

గీ. ఎవనిచేతను వంగడ మెల్లఁ బెంపు
వడయు నని యాసపడితివో వాని నట్టు
లగ్ని గొనుచుండ, నోహృదయంబ ! నీవు
కంటఁ జూచియు బ్రద్దలు కావదేమి !

అర్జు—("పాడమి" యను పద్యమునే పఠించుచుఁ గృష్ణ ఘటోత్క-చులతోఁ బ్రవేశించి, కురు లార్చుకొనుచు నడయాడును.)

అందఱు—(రవంత సేపు నిశ్శబ్దముగా నుందురు.)

అర్జు—(ఆకస్మికముగ నిలిచి) అన్నట్లు, మఱచితిని!—బావా యింటాఁక, బాబు నోటినుండి వినవచ్చిన దేమో తెలిసినదా?—

కృష్ణు—అవు నవును!—అన్నట్లాసంగతి మనము చెప్పుకొననేలేదు!-ఏమి వినవచ్చినది ?

అర్జు—అంత స్పష్టముగఁ గాదు ! గాని—"సైంధ-వుఁడు; సైం-ధ వుఁ-డు" అన్నట్లు మూఁడుసారులు వినవచ్చినది !

ఘటో—(దివాలున లేచి) సందేహ మక్కఱ లేదు!—తమ్మున కా దుష్టుని మీఁదనే దృష్టి యుండియుండును. నే నొకసంగతి చెప్ప మఱచితిని. దుశ్శాసనకుమారుం జంపి, రక్తపాతమువలనం గ్రమ్మ మైకముచేఁ దూలిపోవుచుఁ, జేతినుండి జారిపోయిన గదాదండము కొఱకు నెమకులాడు తమ్ముని-సైంధవపాతకుఁడు చాటు నుండి కుంతమునఁ బొడిచి కూలఁ ద్రోసె నఁట !

భీము—(క్రోధముతో) ఆఁ! అట్టిస్థితిలో సైంధవుఁ డంతపని చేసెనా?

గీ. తల్లి సాన్నిధ్యముం బాసి, దారి తప్పి,
హరికిశోరము బోయల యంపపెట్ల
నసురులం బాయు తఱి, వెన్కనుండి కాలు
కఱచెనఁట కుక్క ! యేమందుఁ గాల మహిమ !

అందఱు—(మరలఁ గొంచెము సేపు నిశ్శబ్దముగా నుందురు.)

అర్జు—(ఆకస్మికముగ గొంతెత్తి) ఘటోత్కచా! గాండీవము !—గాండీవము !—(అని చరచరఁ బరిక్రమించుచు.)

యుధి—బావా! బావా!—చూచుచు నూరకుంటి వేమి?—తమ్మునకు దుఃఖోన్మాదము తీవ్రమయినది !

కృష్ణు—(దిఢాలున లేచి పోయి యర్జునుని) బావా! యెక్కడికి ప్రయాణము?—

అర్జు—(వెఱ్ఱివానివలెఁ జూచి, తప్పించుకొని. పరిక్రమించును.)

కృష్ణు—(వెనుకొని) బావా, మతి పోయినదా యేమి!—యొంటరిగా నెక్కడికి ప్రయాణము!

అర్జు—(రౌద్రముగా) ఎక్కడికా?—కౌరవ స్కంధావారమునకు!

కృష్ణు—ఎందులకు?—

అర్జు—(రౌద్రముతో) ఎందులకా!—ఏమీ?—ఎందులకా!—

ఉ. ఎవ్వఁడు మత్తసూభవుని; వెంతయు డస్సిన వాని, నొంటరిన్,
మవ్వపుమేను తూట్లువడ మత్తిలి నెత్తుట దోఁగు నత్తఱిం
గ్రొవ్వున మాటున న్నిలిచి కుంతమునం బొడువంగఁ జాలెనో
యవ్వాఁడుగుం జడుం ఖలు దురాత్ము జయద్రథునాపువాఁపఁగన్!

(అని పట్టు విడిపించుకొని పరిక్రమించును.)

కృష్ణు—(మరలఁ బట్టుకొని) బావా! బావా!—ఒక్కమాట—

అర్జు—(వారించుచు) విసను! నీమాటమాత్రమింక విసను!- విని యిదివఱకుఁ బొందిన మోసము చాలును!

కృష్ణు—బావా! నీవు నావలన నేమి మోసము పొందితివి?—

అర్జు—చెప్పుమనెదవా?—

గీ. ప్రబల కోలాహలము వినఁబడిన యపుడుఁ,
బరిసరములఁ బుచ్చెలు వచ్చి పడిన యపుడు,
నుల్కిపడుచు ని దే మన—నురక యేలఁ
గలఁగఁబాఱెద వని నన్నుఁ గసరికొనవె?

కృష్ణు—శివశివా? నే నపు డట్లు వారించినది నిన్ను మోసపుచ్చుట కేనా! బావా! అభిమన్యుఁడు నీకుఁ గొడుకె కాని—నాకు మేనల్లుఁడు కాఁడా?

అర్జు—సరి పోనిమ్ము—ఇప్పు డావిచార మవసరము లేదు—నన్ను మాత్రము పోనిమ్ము! (అని విడిపించుకొని పరిక్రమించును)

కృష్ణు—(వెంబడించుచు యుధిష్ఠిరు నుద్దేశించి) బావగారు!—మీరు రాక తప్పదు!—మీతమ్ముఁడు నాకు నిలుచునట్లు లేదు!

యుధి—(తోటుపాటుతో లేచి పోయి, అర్జును నడ్డుకొని) తమ్ముఁడా

గీ. ఎన్నఁడును నీవు నామాట కెదురు చెప్పి
యెఱుఁగ వాపత్తనమె నిల్పు మిపుడుఁ గూడ ;
శాత్రవులు నిద్రఁ గొనుతఱి నాపదుతఱి
సమరమున కెత్తిచనుట యక్రమము కాదె!

అర్జు—(విసుగుతో) ఇస్—అబ్బా!...అన్నయ్యగారు! మొదటనుండియు మీరిట్లే వారి కాయువు పోయుచున్నారు! సరి కానిండు—(ఆకసమువంకఁ జూచుచు) ఓ కౌరవ గూఢచారులారా! మీరు శీఘ్రముగాఁబోయి నా యీ ప్రతిజ్ఞ మీ రాజునకు వినిపింపుఁడు!-

చ. సకల సురాసురప్రతతి సాయము వచ్చినఁ, బంకజోదరాం
ధకరిపు లడ్డు చొచ్చినఁ, బితామహుఁ డెచ్చిన, నెల్లిపొద్దు గ్రుం
కకమును సైంధవాపశదు కంఠముఁ ద్రుంచెదఁ- దప్పనేని, త
ప్పక నృపులెల్లఁ జూడఁ జొరఁబాఱెదఁ జిచ్చున గాండివంబుతోఁ!

కృష్ణ—ఈదుస్సలాధవుని వధించుటకు నీవిదివఱకే శపథము సలిపితివి కాని-యిప్పు డందులకు మితిపెట్టి మాకు భయమును గల్పించినవాఁడ వైతివి. మనమిఁక నిచ్చటఁ దడయరాదు. పోయి తత్సంగతి యాలోచింతము రమ్ము.

అర్జు—బావా! యేల భయపడెదవు?-

గీ. పట్టునది గాండివము ; పాశుపతము మొదలు
గాఁగలవి యస్త్రములు ; తేరు గడపువాఁడు
చక్రి ; సంగ్రామకర్త యీ సవ్యసాచి;
యెప్పఁ డేరీ జగముల నెదురు వారు!

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.



## విష్కంభము.

[సంజయ వైశంపాయనులు ప్రవేశింతురు]

వైశం—తదనంతరము వాహినీపతు లెల్లర ధర్మజుచే ననుజ్ఞాతులై పోయి తమతమ బలంబులు రావించిరి. కృష్ణుండు రథ మాయితంబు చేయించి తెచ్చి మొగసాల నిలిపె అర్జునుడు సాత్యకి భీమసేన ద్రుపదసూనుల నొక్కరొక్కరి నెయ్యలకుం దోడుకొని పోయి యుధిష్ఠిర రక్షణమునుగూర్చి నొక్కినొక్కి చెప్పెను.

సంజ—అదిగో, అదియే ధర్మరాజునకుం గల యఖండభాగ్యము!

క. తనయెడల వినయముం గడు
వినయము, గౌరవము, కూర్మి, వేర్మియు వెలయం
దనసేమమె పలవించెడు
ననుజులుగల యన్నభాగ్య మలవియె పొగడన్!

పిమ్మట ?

వైశం—పిమ్మట, సమ స్తబలంబులు సంగరభూమి నలుకం దహతహపడుచుండ, రణతూర్యంబులు దిక్కులం బ్రతిధ్వనించుచుండ, విప్రనికరంబు లాశీర్వాదంబులతో నక్షతలు గురియుచుండ, వందిమాగధులు కులగౌరవముం గొనియాడుచుండ, కృష్ణుండు తేరినొగ యలంకరించి "ప్రొద్దెక్కెడు"రమ్మని త్వరపెట్టుచుండ- దివ్యమణులచే దీపించు కిరీటంబుతోం; గనులకు మిఱుమిల్లు గొలుపు తళ్తళంబుతో; నాలుకలు గ్రోయు నంపమొత్తంబుల యక్షయ తూణీరంబులతో; నప్పుడ యర్పించిన గందపుం జుక్కలు గల గాండీవంబుతో; నిజప్రతిజ్ఞా నిర్వహణదీక్షా సముచిత సమరోత్సాహ సంభరితంబగు వదనారవిందంబుతో సవ్యసాచి యుధిష్ఠిరునకుం బ్రదక్షిణపూర్వకంబుగ నమస్కరించి, యనుజ్ఞవడసి, రథారోహణం బొనర్చె. కాంచన ఘంటికా రవంబులతోం, గపిధ్వజప్రభలతోం దేరు కదలుచుండ నేను ఇక్కవచ్చితిని. ఇంక నక్కడి వృత్తాంతము నీవు చెప్పవలెను.

సం:జ—ఇక్కడివృత్తాంత మెంతని చెప్పుదును! పార్థునిప్రతిజ్ఞ విని భయవిహ్వలుఁడైన సైంధవున కూరటగా—ఆచార్యులవారు రాత్రి చెప్పినదానికంటె నేఁడు చేసిన సన్నాహము వేయిమడుంగు లధికముగానున్నది! ఇరువదినాలుగుక్రోశముల పొడవును బదిక్రోశముల వెడల్పును గలప్రదేశమున శకటవ్యూహమును నిర్మించి, దానిపశ్చిమార్ధభాగంబునగర్భవ్యూహముగాఁబద్మవ్యూహమును రచించెను. తన్మధ్యంబునుండి శకటవ్యూహద్వారంబు దెసకుసూచీవ్యూహంబు పన్ని, తన్ముఖంబున భోజసేనా సమన్వితుండగు కృతవర్మను; దన్మధ్యంబున నిజసేనాపరివృతుండగు కాంభోజరాజును; దన్మూలంబున నాప్తులగు శతసహస్ర యోధులతోడి కురురాజును నిలిపెను. దానివెనుకఁ, బదునాలుగువేల దంతావళంబులతోడను. నలువదివేల రథంబులతోడను, జక్రవ్యూహమును నిర్మించి. దాని వెలుపలిభాగంబున నెన్నికగన్న లక్ష యాశ్వికులను, లోపలిభాగమున మెచ్చువచ్చిన పదిలక్షల పదాతులను, నిలిపి-తన్మధ్యమునఁ గర్ణశకుని శల శల్య భూరిశ్రవ సోమదత్త కృపాచార్య దుశ్శాసను లంగరక్షకులుగా సైంధవుం బ్రతిష్ఠించెను.

వైశం—అట్లయినఁ బాండవుల కిది చాల గడ్డుదినమని చెప్పకతప్పదు! సరికాని-మనము వ్యూహ మంతయు నెక్కడనుండి చూడనేర్తుము?

సం—ఇవిగో దూరదర్శికలు. నిన్నటి తమాలవృక్షము మీఁదనే కూరుచుండి, వీనిసాయమున సర్వమును జూడఁగలము. దీనిని నీవు గైకొనుము. (అని యొకయంత్రి మొసఁగును.)

వైశం—(యంత్రముగుండ ముందునకుఁ జూచుచు) ఓహో ప్రతి పదార్థ మెంత విస్పష్టముగా నగపడుచున్నది! అదుగో! దుర్యోధనుఁ డెందులకో గాని-యతివేగముగ నాచార్యుఁ డున్న దెసకు వచ్చుచున్నాఁడు. రమ్ము, రమ్ము, మన మేగి వృక్షారోహణ మొనర్తము. (ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది శుద్ధవిష్కంభము.

---

# పద్మవ్యూహము.

## షష్ఠాంకము.

రంగము :— వ్యూహమండలము.

వ్యూహముఖమునఁ బాదచారులై ద్రోణ దుర్యోధనులును; దూరమునఁ జెట్టుపైఁ గూరుచుండి సంజయ వైశంపాయనులును బ్రవేశింతురు.

ద్రోణు—మహారాజా! వ్యూహ మంతయు విలోకించితివి కదా- యెట్లున్నది ?

దుర్యో—జగజ్జేగీయమానముగా నున్నది, నేఁడు మీధనుర్వేదవైదుష్యమును గొనియాడనివారు లేరు. ఇంతటితో నిశ్చయముగ నాకు జయము సిద్ధించునని యున్నది కాని—యొకసందియము మాత్రము కొంచెము బాధించుచున్నది.

ద్రోణు—ఏ మాసందియము ?

దుర్యో—మఱేమియు లేదు. అర్జునునిపై మీకు వాత్సల్యము మెండని వాడుక. అతనిమొగము చూడఁగనే మనసు కరఁగి దారియొసఁగుదు రేమో యని నాసందియము.

ద్రోణు—(తనలో) ఇతఁడు వట్టి కృతఘ్నుఁడు !

చ. పనిఁగొని జాతిచెట్టున కవారిగ నీరము వోయుటల్ ; శవం
బున కకలంక రత్నమయ భూషలచేఁ గయిసేయుటల్ ; పొలం
బున దయివాఱునట్టి వెఱబొమ్మకు ఛత్రము పట్టుటల్ ; కృత
ఘ్నునకు హితంబొనర్చుటలునుం గడువ్యర్థపుఁ గృత్యముల్ గదా !

(పైకి) మహారాజా ! యీ సందియము నీకె కలిగినదా—లేక నీ యాంతరంగికమంత్రి యగు శకుని కలిగించినదా ?

దుర్యో—ఎట్లయిన నేమి ? —మీ రిప్పుడు చేయవలసినది తన్నివారణము గాని-తద్విచారము కాదు.

ద్రో॥ — అట్లయిన నందులకు సాధనముకూడ నీవే చెప్పవలయును.

దుర్యో—చెప్పుటకే వచ్చితిని. కాని, మీ రన్యథా భావింప నని మాట యిచ్చినఁ గాని చెప్పుటకు సందేహముగా నున్నది.

ద్రో॥—మహారాజా! అట్టి సందియ మెన్నఁడును వలదు. నీ కొక యనుమానము కలిగినప్పుడు దానిని నిర్వర్తించుకొనుట నీపని-నిర్వర్తించుట మాపని. కాకున్న నుభయులకును సుఖము లేదు.

దుర్యో—అట్లయిన నిదిగో విన్నవించెదను: మీస్థాన మంగరాజున కొసఁగి మీరు సైంధవునికడకు వచ్చిన నాకుఁ దృప్తిగా నుండును.

ద్రో॥—ఇంతియేకద!—అట్లే చేయవచ్చును. అంగరాజు వ్యూహముఖమున నుండి కార్యము నిర్వహింపఁగలఁ డనునమ్మకము నీకుఁ బూర్తిగఁ గలదు కద?

దుర్యో—అతనిసామర్థ్యమునెడ నాకుఁ బూర్ణమైన విశ్వాసము కలదు. నాకే కాదు—పరీక్షకొరకైన నిపుడీయవకాశ మొసఁగి చూచితి రేని మీకును గలుగఁ గలదు.

ద్రో॥—నీ కట్టినమ్మకము న్నప్పుడు నీయిష్టానుసారముగా జరిగించుటయే నా పని. నే నచటికిం జని యతనిం బంపెదను: అంతపర్యంత మిచ్చట నీ వుండుము. (అని కొంచెము నడచి తనలో) ఈతనికి వినాశకాలము సమీపించినది! కాకున్న నీతరుణమున నిట్టి విపరీతబుద్ధి పుట్టదు!

ఆ. వె. తిన్నఁగా నదృష్ట మున్నపు డన్నిట
బుద్ధి తిన్నఁగానె పోవుచుండు;
నయ్యదృష్ట మించుకంత వక్రించిన
బుద్ధి వక్రతతముఁ బొంది నడచు! (నిష్క్రమించును)

దుర్యో—(వినుట నభినయించి) ఏమి ఘోరోదాశము! (నిదానించి)

గీ. మొగటఁ దుమ్మెట రొద వోలెఁ, బిదప వాయు
సంక్షుభిత వారినిధి ఘోష సరణి, నవలఁ

బ్రిలయమేఘ గర్జన మట్లు ప్రబలు నద్ది
గాండీవ జ్యానినాదముగాఁ దలంతు.

(పరికించి) సరి, యింక నేమి-అదిగో! కపిధ్వజము. (వెనుకకుఁ దిరిగి చూచి) ఇదుగో! కాలపృష్ఠము మ్రోయించుచుఁ గర్ణుఁడును వృషసేనునితో సేనాముఖమునకు వచ్చుచున్నాఁడు. అతనిం గలిసికొని హెచ్చరించి వాస్థానమునకు నేఁ జనియెద. (అని నిష్క్ర-)

(అంతట రథస్థులై కృష్ణార్జునులు ప్రవేశింతురు.)

అర్జు—(ముందునకుఁ జూచి) బావా! యేమిది?-సేనాముఖమునం దాచార్యులవారికి బదులుగా నంగరా జగపడుచున్నాఁడు!

కృష్ణ—నేను నదే చూచుచున్నాఁడను. ఇందుల కేదియో విశేష కారణ ముండవలెను.

అర్జు—కారణ మేమయినను సరియె కాని—యిందువలన నాచార్యులవారును నేనును గూడ ధన్యుల మగుదుము. ఏమందువా?—

గీ. శిష్యవాత్సల్యమునఁ జేసి చేసె ద్రోహ
మవనిపతి కనునింద నూయనకుఁ దప్పు;
దయను నాచార్యుఁ డొక్కింత దారి యొసఁగ
దాఁటె ననుమాట నాకును దప్పిపోవు.

కృష్ణు—(తనలో) ఇతనికిఁ బురికొక్కించుట కిదే మంచిసమయము: (పయికి) ఏమీ!—నూ చిచ్చఱపిడుగుం గడచి యిప్పుడె మొగ్గరమునఁ బ్రవేశించినట్లే మాటాడుచుంటివే!

చ. పరబల నార్తి బొందఁ, దవక్రపరాక్రమ సంగతుండు, సం
గరనిగమార్థ కోవిదుఁడు, కర్కశుఁ, డర్కసమాన తేజుఁ, డ
క్కురుపతి నమ్మికొన్న రథికుం, డలకర్ణుఁ డతండు గాన మొ
గ్గరమునఁ గాలు వెట్ట శితికంఠున కేని వశంబె యర్జునా!

అర్జు—బావా! యీమాటలు నీవు * స్థూణానిఖనన్యాయముగా-ననుచుంటివో— లేక, మనఃపూర్వకముగానే యనుచుంటివో యెఱుఁగను గాని—మనలో మనము గనుకఁ జెప్పుచుంటిని—

* స్తంభము పాఁతి బిగిసినదో లేదో యని యూఁపి చూచినట్లు,

చ. కరమున గాండివంబు గలుగన్, నొగపైన సమస్తమంగళా
కరుఁడవు నీవు గల్గ నొకకర్ణుని గా దిటువంటికర్ణులన్
వరుసగఁ గౌరవేశ్వరుఁడు వందలు వేలును దెచ్చెఁగాక - నేఁ
డరసెద లెమ్ము — నీ మఱంది యాహవపాలవమెల్లఁ గేశవా !

కృష్ణు — మంచిది. కుడువఁ బోవుచుఁ గూరాకు రుచి యడుగనేల ?- రవంత సేపటి కన్నియుఁ దేలఁ గలవు. (ముందునకుఁ జూచి) అదిగో ! అతని యాత్రము చూచితివా ? — వ్యూహ ముఖము విడిచి నీకొఱ కెదురు వచ్చుచున్నాఁడు !

కర్ణు — (రథస్థుఁడై ప్రవేశించి) అవురా ! యీశ్వరవిలాసము !

చ. ఒకజనయిత్రిగర్భమున నుద్భవ మందినవార మయ్యు ని
ట్లొకరిని బోరువం దొకర ముక్కడఁగింపఁ దలంతు మన్యుల
ట్లకట ! నరుండు నేను ననయంబు, మదిన్ లవమేని ప్రేమ తా
ల్పక, యిదియెల్ల నీశ్వరవిలాసము కాక మఱేమి యారయన్ !

సీ. కాల కేయాది రాక్షస యోధనాథులఁ
బట్టి మట్టాడిన బాహుశాలి
యెక్కటిపోరున ముక్కంటి నుక్కునఁ
దలపడి యోర్చిన ధైర్యశాలి
కడుబలాన్వితుఁ డైన గంధర్వ భర్తను
గెలిచి మెప్పందిన కీర్తిశాలి
దివమును దర్శించి దివిజేశుచేత నా
తిథ్యముం గొన్న యదృష్టశాలి
అట్టి యితనిచేత ననిశంబుఁ బరిచర్య
లందుకొఱకు ధర్మనందనుండు
సలిపినట్టి పుణ్యసంచయ మేమొ ! నేఁ
జలుపనట్టి దేమొ తెలియ దార !

కృష్ణు — (రథమును సమీపింపఁ జేసి చిఱునగవుతో) అంగరా జీపూఁ టఁ బెద్దపనికి సిద్ధపడిన ట్లున్నాఁడు !

కర్ణు——(రోషముతో) సర్వజ్ఞుడవు! నీయూహ పొరపా టెట్లగును?

క. పాండవ సైన్యంబున మీ
గాండివి మొనగాఁడు గానఁ, గౌరవసేనన్
దండిమొనగాఁడ నని యధి
పుం డతనిం దాఁక నన్నుఁ బుచ్చె నిచటికిన్.

అర్జు——తప్పు తప్పు!——పాండవసైన్యమునందు నన్నుమించిన మొన గాండ్రు వేనవే లున్నారు. కౌరవసేనయందు నిన్నుమించినవారును నసంఖ్యాకు లున్నారు.

కర్ణు——ఉండవచ్చును. నే నిది వారిని గొంచెపఱుచుట కన్న మాట కాదు. పోనిమ్ము——నీతోఁ బోరాడవలె నను నభిలాష విశేషము గాఁ గలవాఁడను నే నగుటంజేసి, యందుల కిప్పుడుఁ బ్రిథమావ కాశము నా కొసఁగఁబడినది——సరియేనా?

అర్జు——నాతోడిపోరాటము నీకు గౌరవదాయకమె కాని-నాకుమారున కోడి పఱచిన నీతోడి పోరాటము నాకు మాత్రము లజ్జాకరము!

తెరలో——ఔరా ప్రల్లదములు! అట్లయిన నో కుంతీమధ్యముఁడా!

ఉ. నీ రణకౌశలోన్నతియు, నీ భుజశక్తియు, నీదు తెల్వియున్
నీ రుచిరాస్త్రసంపదయు, నీదగు ధైర్యసమృద్ధియుం, గనం
గోరుచు నీనిమిత్త మిదిగో చనుదెంచినవాఁడ- నిక్కమా
శూరుఁడ వేని నన్గదిసి చూపుము నీదుప్రతాప మెట్టిదో.

అర్జు——(ముందునకుఁ జూచుచు) ఏమి? వృషసేనుఁడు వాక్పారుష్య మునందుఁ దండ్రిని మించినవాఁ డయినాఁడే! ఓవీరపోతమా! ముందు నీతండ్రిం గడ తేర్చితినేని-పాపము!- నిన్ను దిక్కులేనివా నిం జేసి చంపువాఁడ నగుదును. కావున-

ఉ. చాపున నేను లేనితఱిఁ దద్దయు డస్సినవాని మత్సుతుం
బాపమునాక వంచనము ప్రిపుగ నీజనకాదు లేకమై
రూపడఁగించి; రే నిపుడు రూఢిగ నీతలఁ ద్రుంతుఁ దండ్రి నీ
ధాపున నుండఁగానె, రణధర్మ, మొకింతయుఁ దప్పకుండఁగాన్.

బావా! రథము ముం దతనిమీఁదికిఁ బోనిమ్ము (నిష్క్రమిం)

కర్ణ——(క్రోధముతో) సూతుఁడా! చూచుచు నూరకుంటి వేమి?

గీ. ఏను దాపున నుండ మత్పూనుఁ దాఁకి
వాని సిగపూవు నేనియు వాడఁ జేయ
నగునె నరునకె కా దల హరున కేని!
వడిగ మన తేరు నచటికే నడువనిమ్ము. (నిష్క్రమించును)

సంజ——ఔరా! పార్థుని పరాక్రమము!

చ. కొడుకును దండ్రియుం గలిసి గుప్పుశరావళియెల్ల నిట్టె పు
ప్పొడిగ నొనర్చుచు, న్విషము పూసినయల్లులఁ గప్పెవారలన్!

వైశం——ఇప్పుడు చూ డిప్పుడు చూడు!
సిడిముడి పెంపు నొంద వృషసేనుఁడు కెవ్వున నార్చి, పేర్చి. క
వ్వడిపయిఁ, దేరిపై, హయులపై, హరిపై, శరవృష్టి నించెఁ దన్!

సంజ——ఇంతలోనె యీయంధకార మేమిటి!

వైశం——ఇది సవ్యసాచి ప్రయోగించిన తమిస్రాస్త్ర ప్రభావము. అదిగో! కర్ణుని వైపునుండి జ్యోతిర్బాణ మొకటి బయలువెడలి చీఁకటిని గబళించుచున్నది...అరెరే! అదేమి!

గీ. శిరము లేనిది యై వృషసేను మేను
తనరుచున్నది యతని రథంబుమీఁదఁ!
గరము లెప్పటియట్లనె కవ్వడిపయి
గుఱుతు తప్పక శరవృష్టి గురియుచుండ!

సంజ——పాపము! కర్ణునివంకఁ జూచితివా?——తన మ్రోల వచ్చిపడిన తనయుని మూర్ధ మవలోకించి—కన్నులం గ్రమ్ము నశ్రుకణమ్ముల నద్దికొని,——దెబ్బవడిన బెబ్బులిచందమునఁ గ్రోధావేశ పరవశుఁడై పార్థునితోఁ దలపడుచున్నాఁడు!

వైశం——తలపడుటయె కాదు——

గీ. భవుని ముష్టిఘాతంబు సంవాహనముగఁ,
గాలకేయాస్త్ర వితతులు పూలసరులు

గా, గ్రహించిన పార్థ నతుంబు నేఁడు
కర్ణుఁ డదె రక్తసిక్తముగా నొనర్చె!

సంజ—అందువలనఁ గ్రుద్ధుఁడై యర్జునుఁడు చేసినపని చూచితివా?

గీ. విఁటినారిని దెగ నేసి, వెస నతండు
గుణము వెండియు సవరించుకొనెడులోన
సానపట్టిన యొక శాతసాయకమున
సారథి శిరంబు ద్రుంచె దోస్సార మొప్ప.

వైశం—అంతమాత్రమున నైన దేమియు లేదు లెమ్మా.

గీ. బాహువులు కార్ముకము వంచి భయదలీల
గుణము మ్రోయించి శరములు గురియుచుండఁ;
గాళ్ళు కళ్ళియములు వేళ్ళఁ గదియఁ బట్టి
కడుఁజమత్కృతి హరులను గడపుచుండె.

సంజ—అవును గాని-అంగరాజునకు మానభంగమును, కురురాజున
కాశాభంగమును నొక్కసారిగ వాటిల్లినవి!

గీ. నరుఁడు కళ్ళియ మొకకోల నఱికివైచి
ఘోటముల వాలుటమ్ములు గీలుకొలుప
వాఱువమ్ములు వడి నంగపతి శతాంగ
మీడ్చికొని పోవుచున్నవి యెటకొ కనుము!

వైశం—అయ్యో! యింకే మున్నది!—

గీ. తురగములు తుళ్ళిపడి హద్దు తొలఁగి పాఱఁ
గరులు శివ మెత్తినట్టులు కలఁగఁ బాఱ
దేవదత్తము పూరించి తెగువ రిపులఁ
గసిమసంగుచు నరుఁడు మొగ్గరము సొచ్చె!

సంజ—అంతియే కాదు—పాండవయోధులు సింహనాదంబులు సేయు
చుఁ దమతమబలంబులతో వ్యూహముఖమును సమీపించినారు.
(పరికించి) కాని, యకాలవర్షమువలె నింతలోనె వారిపైఁ గురియు
నాశరవృష్టి యెక్కడినుండి చెప్పుమా! (మరలఁ బరికించి) సరి,

యింక నేమి!—యెట్లు తెలిసినదో కాని- యెవరో! భారద్వాజుల వారు వచ్చి వ్యూహముఖమున నిలిచి భల్లపరంపరలచే భూనభంబులం గప్పుచున్నారు! అర్జునుడు కానరాఁడేమి చెప్పుమా!

వైశం—కానరా కేమి?—కృతవర్మను క్షతవర్మను గావించి, శ్రుతాయువును గతాయువుం జేసి, కేకయవంశమును గూఁకటివేళ్లతోఁ బెల్లగించి, వసాతిని రసాతలంబున కనిపి, దీర్ఘాయువును దీర్ఘనిద్రం బుచ్చి, కార్పాసరాశిం బడ్డ యగ్నికణంబు చందంబున సకలసైన్యములం గాల్చుచుఁ బోయి పోయి యదుగో! యిప్పుడు కాంభోజసైన్యాటవీ మధ్యమునఁ గార్చిచ్చు మచ్చున విరాజిల్లుచున్నాఁడు.

సంజ— (చూచి) ఆవు నవును. అచ్చటనున్న యాఱువేల రథంబులు వితథంబులు గావించి, దుర్యోధనుని మనోరథంబుతోఁ గూడఁ గాంభోజరాజు కాంచనరథంబు భగ్నం బొనర్చి, పోయి యిపుడు యవనసైన్యార్ణోరాశిం బ్రవేశించుచున్నాఁడు.

వైశం—సవ్యసాచి రెండుచేతుల కిపుడు సంపూర్ణముగాఁ బని కలుగును.

ఆ. వె. నిడుదగడ్డములును నిట్టనోసళ్లును
రాగివెంట్రుకలును రంగులు కనులుఁ
గలిగి వానరములగతి నొప్పు యవన పా
రద శకాదు లదిగొ! పొదివి రతని.

సంజ—ఆమిడుతలదం డతనిఁ జాలసేపు నిలువరింపఁ గలిగినది కాని—శల్యమాంస మస్తిష్కరాసులతో నిండి యారణరంగ మెంతలో నెంత బీభత్సముగా మాఱినదో చూచితివా?

వైశం—వెఱ్ఱివాఁడా! వాసుదేవానిల ప్రేరితుండగు విజయహుతాశనుఁడు ప్రవేశించినంతవఱ కెచ్చట బీభత్సముగా లేదు! ఎదుర్కొనినవారి ప్రాణంబులు బాణనాళంబులఁ బీల్చివేయుచుఁ, బోయి, యిప్పుడు కౌరవేశ్వరుని కక్ష్యలోఁ బ్రవేశించుచున్నాఁడు చూడుము

సంజ—పాపము! దుర్మర్షణుఁడు ప్రథమకబళమైనాఁడు! ఛీ! దుశ్శాసనుఁడు సింహమువలెఁ దాఁకె గ్రామసింహమువలెఁ బలాయితుఁ

డగుచున్నాఁడు! కాని, కురుపతి తక్కుంగల సోదరులతోఁ దలపడి యర్జును నరికట్ట, నచటిశతసహస్రయోధులు నొక్కసారిగ ముసల ముద్గర పరశు పట్టిసాద్యాయుధంబులం గురిసి కిరీటియరదమును నీరదచ్ఛన్నమగు మార్తాండ మండలముం గావించిరి.

వైశం—కాని, యేమిలాభము!—రథ గజ తురగములు తెగి గుట్టలుం పడుచున్నవి: యోధుల మస్తకములు మింట బంతులవలె నాడు చున్నవి. సరి, యింకనే మున్నది! వికలీకృత కోదండుండై, విచ్ఛిన్న తనుత్రాణుండై దుర్యోధనుఁడు తేరు డిగ్గి పఱవుచుండ, నెక్కడివా రక్కడినుండియె దిక్కు మొగము లగుచున్నారు!

సంజ—సుయోధనున కిప్పుడు లోహకంచుకమే కాదు. ధైర్యకంచుకము కూడ విచ్ఛిన్నమైన ట్లున్నది! ఆచార్యులవారి కడ కరిగి యేమో మొఱవెట్టుచున్నాఁడు.

వైశం—సరికాని— అర్జునుని యరద మరిగి యరిగి, యిప్పుడే యాటంకము లేనిచోట నాఁగుచున్న దేమి చెపుమా!

(అంతట నర్జునుని రథము మరలఁ బ్రవేశించి నిలుచును)

అర్జు—బావా! యేమిది రథ మాఁపితివి?

కృష్ణు—ఏమా?

ఉ. వ్రాలెను బొమ్మ తద్దయును, వారువము ల్గను డస్సి నేలపైఁ
గాళులు మోపలేక తలఁకంగఁ దొడంగెను, గార్య శేషముం
జాలఁగఁ గల్గియున్న దొకసారి యొకించుక నిల్పి వీనికి
న్నీళులు వెట్టకున్నఁ జననేరవు ముందున కింక బారెడున్!

అర్జు—బావా! శత్రుమధ్యమున వీనికి నీర మెక్కడనుండి వచ్చును?

కృష్ణు—ఎక్కడినుండి వచ్చునా?—భీష్మపితామహుున కెక్కడి నుండి వచ్చెనో వీనికి నక్కడినుండియే రాఁ గలదు.

అర్జు—(మందహాసముతో) మంచిది కానిమ్ము—నీయానతి నాచే నేమి చేయింప నేరదు? (అని గాండీవముతోఁ గ్రిందికి దిగును.)

కృష్ణ—(రథము దిగి, గుఱ్ఱములను బరిశీలించి) అర్జునా! రెల్లిపూల కంటెం దెల్లనగు వీనిమేనులు కెంపులు చెక్కినట్లు గాయపడుటయె కాక—యింకను నెన్ని యలుగులం గలిగి యున్నవో తిలకించితివా? (అని యలుగులం బెఱుకుటకు మొదలు పెట్టును.)

అర్జు—బావా! యినుమును గూడిన యగ్గికిని సమ్మెటదెబ్బలు తప్పవు గదా! (ముందునకుం జూచి) అదిగో! యచ్చటం బచ్చిక దట్టముగా నున్నది. పాతాళోదక సమాకర్షణమునకుం గూడ నదియే యుచితస్థలము. (అని నిష్క్రమించి మరలం బ్రవేశించి) బావా! జలము నాకర్షించుటయే కాక—శత్రువులవలన మన కార్యమున కంతరాయము కలుగకుండ నాప్రదేశమున కంతకు నలుగులతోం బంజరము కూడ నిర్మించితిని. నీవు పోయి నీపని చూడుము—నే నిచ్చటం గావలిగా నుండెదను.

కృష్ణ—(రథముతో నిష్క్రమించును.)

(నేపథ్యమునం గలకలము.)

తెరలో—అర్జునా! మన మిప్పు డనువు తప్పియుంటి మని శత్రుసైన్యము తరంగన్యాయముగా వచ్చుచున్నది జాగ్రత్తసుమా!

అర్జు—(సంరంభముతో) రానిమ్ము, రానిమ్ము. (కొంచెము ముందున కేగి, బిగ్గఱగా) ఓ కౌరవ వాహినీపతులారా!

చ. దళమగు ఖాండవంబు భయదస్థితిం గాలిచి, కాలకేయ ము
ఖ్యుల రుధిరప్రవాహమునం గ్రుంకిన మత్పటుసాయకోత్కరం
బులు పసమించు మీావన సమూాలముగాం జవిచూడం గోరి నా
ల్కలు వెలికి న్నిగిడ్చెడు ; విలంబము సైపవు; రండు వేగమే !

ఏమి! యొక్కసారిగ వచ్చి పైం బడం జూచుచున్నారా? ఇదిగో! యీ యైంద్రాస్త్రము మి మ్మెల్లర నెంతదూరము కొంపోయి పాఱవేయునో చూడుండు! (అని బాణము విడుచును.)

కృష్ణ—(ప్రవేశించి) అర్జునా! యేమోయి-నీయైంద్రాస్త్రప్రభావము!

చ. విడుచుటయే విలంబముగ భీషణరావమునం జగంబు ది
బ్బడిపడం జేసి, శాతశరపంక్తు లవారిగ వెల్వరించుచుం

గడఁగి ప్రచండలీల- సుడిగాలి తృణావలి నెట్టు లట్లు, నె
వ్వఁడిఁ గొనిపోయి పోయి పడవైచెను దవ్వుల సర్వసైన్యముల్ !

తెరతో—ఓహో ! బంధు మిత్త్ర సామంత వీరవరేణ్యులారా !

ఉ. రండు భయంబు లేదు, కురురాజు సమీపమునందు నుండ నా
ఖండలుఁ డేని కన్నెఱచి కన్గొన నేరఁడు మిమ్ము, నింక నీ
గాండివి యెంతవాఁ డితని కార్ముకపాండితి యెంతపాటి ? మ
చ్చండతరాశుగంబుల వెసం బరిమార్చెద వీని నిప్పుడే ?

కృష్ణు—(అదరిపాటుతో) వీ రెవరు ! (అని తిరిగి చూచును.)

అర్జు—(చూచి) ఇంకెవరు !—దుర్యోధనమహారాజుగారు !

కృష్ణు—ఇప్పుడేగదా చావుదెబ్బలు తిని పోయినాఁడు ! ఇంతలోనే మరల నింతపొగరుకొని వచ్చుట కేదియో కారణ ముండవలెను.

అర్జు—కారణము కానిపించుచునే యున్నది. అతఁ డిప్పుడు ధరించిన కవచ మభేద్య మయినది. ఆ దివ్యకవచము నాచార్యులవారును నేనును దక్క నన్యు లెఱుఁగరు. పోయి తనయవస్థను మొఱపెట్టుకొన మనసు కరగి యాయన దీని ననుగ్రహించి యుందురు.

కృష్ణు—అట్లయిన మనలను సాధారణముగ విడువఁడు. ప్రొద్దుకూడ విశేషముగ లేదు. ఇందుల కేమి సాధనము ?

అర్జు—అదియే యాలోచించుచున్నాఁడను.

కృష్ణు—ఇంకను నాలోచించుచునే యుంటివా ! మంచిది కానిమ్ము. గుఱ్ఱములు బాగుగా సేద దేఱినవి; రథము త్రిప్పి తెచ్చెద నెక్కుము—పైసంగతి నేనె చూచెద. (అని పోయి రథము తెచ్చును.)

కృష్ణు, అర్జు—(మరల రథ మధిష్ఠింతురు.)

దుర్యో—(సంరంభముతోఁ బ్రవేశించి)

చ. నిలునిలు మెందుఁ బోయెదవు ? నీభుజసారము, నీదుబీరముల్
దెలిసికొనం దలంచి చనుదెంచినవాఁడను ; ధైర్య సాహసం
బులు గలవేని నిల్వఁబడి పోరుము ; కృష్ణుఁడు చూచుచుండ నీ
తల తెగఁగొట్టి నీదు శపథంబు వృథావృథ సేతు ఫల్గునా !

కృష్ణ—(మందహాసముతో) సరి కాని, బావా! నీయట్టిమానవంతుఁడు లేఁడని వాదుక !-చివర కింత కానిపని చేసితి వేమి ?

దుర్యో—ఏమి కానిపని చేసితిని ?

కృష్ణ—ఆచార్యుని బిచ్చమెత్తి యాకత్తళముం దెచ్చికొంటివి కదా! చూచినవా రే మనుకొందురు ?

దుర్యో—(వెలవెలపాటుతో) ఏ మనుకొందురు ?

కృష్ణ—(పకపక నవ్వి) అదికూడ నేనే చెప్పవలెనా !—అర్జునుని యాశుగములకు వెఱచి దానిం దగిలించుకొని వచ్చె ననుకొనరా? పోనిమ్ము—దాని యాధారమున నొకవేళ నీవు గెలుతు వనుకొనుము- అప్పు డాప్రతిష్ఠ యాచార్యునకుఁగాక-నీ కెట్లు దక్కును?

దుర్యో—(రోషముతో) అట్లయిన, నిదిగో ! దీని నిప్పుడ తీసివేయుచున్నాఁడను. (అట్లు చేసి) మనపోరాటమున కానమస్థల మనుకూలముగా నుండును,-రథ మచటికి రానిమ్ము. (అని నిష్క్రమిం.)

అర్జు—బావా! యేమిటి యాలోచించుచున్నావు ?

మ. విసముం బెట్టిగఁ జేసె నన్నమున, సుప్తింజెంది యుండంగ మా బసఁగాల్పించెను, మాయజూదమున సర్వస్వంబుఁ గాఁజేసె, న న్న సభామధ్యమునం గులాబ్జముఖి మానం బార్ప యత్నించె, నీ పసరంబుం బరిమార్తు నీక్షణమ బావా ! తేరు వోనీయుమా !

కృష్ణ—బాగు, బాగు ! నీపుణ్యము గాని—భీమసేనుని ప్రతిజ్ఞకు భంగము మాత్రము కలిగింపకుము (అని రథముతో నిష్క్రమిం.)

శకుని—(అంతటఁ బ్రవేశించి, అన్నన్నా ! దుర్యోధనుఁ డెంత వెఱ్ఱిపని చేసినాఁడు! (ముందునకుఁ బరికించి) సరి, యింకేమున్నది!-సవ్యసాచి క్షణములో విల్లు దునిమి, సారథిం జంపి, గుఱ్ఱములం దెగటార్చి, యొడలు చిల్లులువడ నేయ రథంబునుండి గుభాలున నుఱికి పరువిడి వచ్చుచున్నాఁడు !

దుర్యో—(రక్తసిక్తాంగుఁడై మరలఁ బ్రవేశించి) మామా ! యిదిగో! నీ విక్కడనే యుంటివా !—నీకొఱకే చూచుచున్నాఁడు

శకు—ఈవైపుననున్న మూఁకలం బురికొల్పి వెనుకనుండి ముట్టడింపం జేయవలె ననుతలంపుతో వచ్చి- నీవును నిటే వచ్చుచుండుట చూచి నిలిచినాఁడను.

దుర్యో—(ధైర్యముతో) మామా! "మహాగజాః పలాయంతే మశకానాంతు కాగతి" యన్నట్లు- ఈచిల్లరిమూఁక యేమి చేయఁగలదు?

శకు—నిజమే, నిజమే. ఇఁక మన మిప్పుడు చేయవలసిన పనియేమి?

దుర్యో—అదియే నా కేమియుఁ బాలుపోక నిన్ను స్మరించినాఁడను. (ఆకసమువంకఁ జూచి) నాలుగైదుగడియల పొద్దుకంటె లేదు: (ముందునకు దృష్టి నిగిడ్చి) కాని, యర్జునుఁ డదిగో! చక్రవ్యూహము వఱకుఁ బోయినాఁడు. అచ్చటనున్న యపార సైన్యమును గర్ణ శల్య భూరిశ్రవ స్సోమదత్త ప్రభృతి ప్రముఖులును, నతని కూపి రాడకుండఁ జేయగల రను నమ్మకము కలదు కాని— యేమో, యెటుపోయి యెటు వచ్చునో యను సందియముమాత్రము బాధించుచున్నది. పాడుసూర్యుఁడు నేడెంతకును గదలిపోకున్నాఁడు! మామా! యింతవంత ప్రొద్దుంగూడఁ గడచి పోయెనా—మన యదృష్ట మే మని చెప్పుదును!

శకు—అట్లయిన, నే నొక యమోఘమయిన యాలోచన చెప్పెద నట్లు సేయుము.

దుర్యో—(ఆత్రముతో) నీమాట నీనోటిలో నుండఁగనే చేసెదను.

శకు—కాని, యిప్పు డది వెల్లడి కాఁగూడదు. (అని చెవిలోఁ జెప్పును)

దుర్యో—(శకుని వీపు తట్టుచు) సెబాసు, మామా! సెబాసు! సైంధవుని ప్రాణమును నా మానమును గూడఁ దక్కించితివి? రమ్ము రమ్ము-పోయి యట్లు చేయుదము. (శకునితో నిష్క్రమింం)

సంజ—వయస్యా! వ్యూహముఖమున నెంతదారుణ సంగ్రామము జరుగుచున్నదో చూచితివా? అంతలేసి మహారథులు నాతీరున నిలువరించు నాచార్యులవారి పరాక్రమ మెంతని చెప్పవచ్చును! (పరికించి) అదేమి! పాండవయోధు లందఱు నాకస్మికముగ సంగ్రామము చాలించి యాకసమువంక విలోకించుచున్నారు!

వైశం—ఆ వైపునుండి యేదియో పుష్పక మొకటి వచ్చుచున్నది. (పరిశీలించి) ఇదేమిచిత్రము!—తన్మధ్యమున నున్నవాఁడు సైంధ వునిఁ బోలి యున్నాఁడు!

సంజ—పోలియుండుట కాదు-సైంధవుఁడే! పుష్పకము చాలఁ గ్రిందికి వచ్చినందున నిప్పుడు స్పష్టముగ నగపడుచుఁ. గ్రిందివారినుద్దేశించి యేమో యనుచున్నాఁడు వినుము.

తెరలో—ఓ యుధిష్ఠిర భీమ నకుల సహదేవ విరాట ద్రుపద దృష్ట ద్యుమ్న సాత్యకి ప్రభృతులారా!

చ. తిరిగితిఁ బార్థపుణ్యమున దిక్తటభూముల నెల్లఁ, గంటి దు
స్తర హిమవన్నగాగ్రమున, జాహ్నవి పుట్టినచోటఁ గ్రుంకితిన్
గర మలరారు వెండిమలఁ గాంచితి, చూచితి నేడు దివ్యులన్
మరలితి నిర్విచారముగ మద్గృహసీమకుఁ బ్రొద్దు వ్రాలుటన్.

గీ. దేవసముఁడ నే నేడ! గాండీవి యేడ!
సందె పడకుండ నతఁడు న న్జంపు టేడ!
ప్రతిన సెడఁ బ్రొద్దు గ్రుంకఁగ వచ్చె నదిగో!
విజయునెడ మీర లాసలు విడువుఁ డింక!

నైశం—సంజయా! అర్జునునకు గొప్పయాశాభంగము సంభవించినది! అతఁడును సమీపించునంత, వారు సైంధవునిఁ బుష్పక మెక్కించి యచటినుండి పంపివైచినారు! శకుని రాహస్య మిదే కావలెను!

సంజ—పాపము! యుధిష్ఠిరుఁడు మిన్ను విఱిగి మీఁదఁ బడినట్లు భీమ సేనునితో నేమో యనుచు నిటు వచ్చుచున్నాఁడు!

(అంతట యుధిష్ఠిర భీమసేనులు ప్రవేశింతురు.)

యుధి—(కన్నీటితో) అయ్యో తమ్ముఁడా! దుఃఖము గాకేమున్నది!

ఉ. మోసమువచ్చె! సైంధవుఁడు మొగ్గరమందు గలం డటంచుఁ బే
రాస ధనంజయుం డరిగె నాదెస. కీదెస నున్నవాఁ డతం!
డీసరవోయెఁ బ్రొద్దును నదేకనుఁగొమ్ము! ప్రతిజ్ఞ తప్పినన్
వాసవి యన్నపల్కఁ గలవంబును దప్పఁ! డికేమి చెప్పుదున్!

ఉ. తమ్ములు గల్గువారు వసుధ న్గల రెండఱ యేని- కాని, నా
తమ్ములవంటి తమ్ము లిఁక దక్కొ_న రొక్కరికైన నంచు గ
ర్వమ్ము వహింతు; నం దెవరిపాదమున న్ములు గ్రుచ్చుకొన్నఁ బ్రా
ణమ్ములు పోవు నా; కిఁక ధనంజయుఁ డైన వచింప నేటికిన్ !

భీము—(సంరంభముతో) అన్నయ్యా ! యిప్పుడు మించిపోయిన దే
మున్నది ? ఈ గదాదండమును గిరగిరఁ ద్రిప్పి వైచిన నా దురా
త్ముఁడు పుష్పకముతోఁ గూడ నుగ్గునూచమై క్రిందఁ బడఁడా ?

యుధి—అప్పుడును నీతమ్మునకుఁ బ్రతిజ్ఞాభంగమే యగును. వీని
నతఁడుగదా చంపవలసినవాఁడు ?

భీము—పోనిండు, తమ్ముఁడు వచ్చువఱకు నూర్యు నరికట్టెదను.

యుధి—తమ్ముఁడా ! నీసామర్థ్య మట్టిదే. కాని, ప్రకృతివిరుద్ధమైన
కార్యమున కెన్నఁడును గడంగరా దని పెద్దలు చెప్పుదురు.

భీము—అట్లయిన మన మిపుడు సేయఁదగినపని యేమియు లేనెలేదా?

యుధి—ఒక్కటి యున్నది. వెంటనే పోయి తమ్మున కీసంగతి తెలిపి
తత్క్షణ మిచటికిఁ దోడితెచ్చుటే తగిన పని.

భీము—దీని కింతయాలోచన మేల ? గాలికంటె ముందు పోయి
కృష్ణార్జునుల నిరువురను మూఁపున నిడికొని క్షణములో నిక్కడ
వ్రాలెదను. (వెనుకకుఁ జూచి) విశోకా ! రథ మిటు రానిమ్ము !

విశో—(రథము త్రోలికొని వచ్చును.)

యుధి—తమ్ముఁడా ! నీవు సుఖముగఁ బోయిరమ్ము. నే నీలోపల
సైంధవహతకుం గనిపెట్టుచుండుటకై ఘటోత్కచుని నియోగించి
మీకొఱ కెదురుచూచుచుండెద. (అని నిష్క్రమించును.)

భీము—(రథమధిష్ఠించి) విశోకా! మనయరదము శీఘ్రముగా నాచా
ర్యులవారివంకకుఁ బోనిమ్ము.

విశో—చిత్తము. (రథము నడపుచు) అయ్యా ! భారద్వాజులవారు
మీ సన్నాహసంరంభము చూచి, నారి సారించి, వింట బాణము
సంధించుచున్నారు.

భీము—(ముందునకుఁ జూచి) ఆచార్యోత్తమా!

క. గురులరు, కరుణారస సం
భరితుల రటుగాన మనసు పాఱదు మీతో
దుర మొనరింపఁగఁ దమ్ముని
కొఱకై చనుచుంటి నడ్డుకొనకుఁడు నన్నున్.

తెరలో—ఉ. ఏ నిట లేకయున్న తఱి నేఁగెను నీయనుజున్ముఁ; డేను వి
ల్లూని మొనన్గను త్రెఅచి పోరుచునుండఁ ద్రినేత్రుఁడున్ రమా
జానియు లోనఁగా లిడఁగ శక్తులు గా, రిఁక నన్య లెంత! పో
పో! నగరాజమును దగరు పోలిక డీకొన వచ్చితే నను౯!

భీము—(రోషముతో లేచి) ఓ కుంభసంభవా!

చ. గురుఁడ వటంచు గౌరవముకోసము పల్కితి నంతెగాక నీ
కరుణయుఁ బ్రాపును న్వలెనె! కాఁచికొనంగల వేని చూచికొ
మ్మరదముతోడ నిన్నిపుడ యంబరవీథికి వీచివైచి ని
ర్భరగతిఁ జొత్తు మొగ్గరము, వారణరాజము మడ్గువం బలె౯.
(అని నేలకు లంఘించి యాచార్యునివంకకు నిష్క్రమించును)

విశో—ఓహో! యేమి మా భీమసేన మహారాజుగారి పరాక్రమము!

గీ. బక జరాసంధ మల్లురఁ బట్టి చీల్చి
నట్టి బాహాయుగంబున నదిమి పట్టి
గురుని యరదం బదే గిరగిరను ద్రిప్పి
పీఁక వినువీధి కల్లన విసరివైచె!

(మరలఁ బరికించి) అరే! అదెట్లు!—ఆచార్యులవారు రుష్టీష
మూడ, జుట్టుముడి వీడఁ, బరుగుపరుగున నాదారిని బలాయితు
లగుచున్నారు!—సరిసరి, తెలిసినది. భీమసేన మహారాజుగారి
నెఱిఁగినవారె కనుక జప్పున వెనుకనుండి జాగ్రత్తపడియుందురు.

భీము—(ప్రవేశించి) విశోకా! అయినవా రందఱుఁ దమ్మునిచేతనే
హతు లయినారు. హతశేషులు నన్నుఁ జూచినమాత్రమున నే

పటాపంచ లగుచున్నారు. కావున నిరంకుశమైన మనయరదమును తెప్పపాటులోఁ దమ్మునికడకుఁ బోనిమ్ము (అని రథమథిష్ఠించును.)

విశో—(రథమును గొంత నడిపి) అయ్యా! అదిగో! కపిధ్వజము! కాని, యచ్చటఁ బోరు బహుఘోరముగా నున్నట్లు సొడకట్టుచున్నది. ఏలినవా రర్జునమహారాజుగారికిఁ దగుసమయమున సాయ పడినవారు కాఁగలరు, (అని గుఱ్ఱముల నదల్చును.)

భీము—విశోకా! జగజ్జేతయగు తమ్మున కొకరిసాయము కూడనా!

చ. విను- మలగాండివస్వనము ; వీనుల వ్రీల్చెడి దేవదత్త సం
జనితనినాద ; మచ్యుతుఁడు సారెకు సల్పెడి సాధువాదముల్!
గను- మల శస్త్రజాలముల ; గప్పలగుత్తులలీల రాలు యో
ధనికర మస్త్రకావళుల, దవ్వులుపట్టు శతాంగ పాళులన్.

విశో—చిత్తము, చిత్తము. నాకించజ్ఞతను మన్నింపుఁడు.

భీము—దాని కేమి గాని—మనరాక తమ్మున కిచ్చటినుండియే తెలియఁజేయుట యుక్తము కదా? (అని శంఖము తీసి పూరించును)

విశో—అదిగో! యేలినవారి శంఖధ్వని గుర్తించి యర్జునమహారాజుగారు తిరిగిచూచి శ్రీకృష్ణులవారితో నేమో యనుచున్నారు. ... ... అదేమి చెపుమా—ఆపాటున శ్రీకృష్ణులవారు రథము మనవంకకు మరల్చుకొని వచ్చుచున్నారు!

అర్జు—(రథముతోఁ బ్రవేశించి, యాత్రముతో) అన్నా! మనయన్నగారికి సేమమేనా?—

భీము—వెఱ్ఱితమ్ముఁడా! అన్నగారు సేమముగా నుండకున్న నీవు నన్ను సజీవునిఁగా జూడఁగలుగుట యెట్లుసంభవించును? ఆయన యాదేశముమీఁదనే నే నిచటికి వచ్చినది.

అర్జు—చెప్పుము చెప్పుము—ఏమని యన్నగారి యాదేశము?

భీము—తమ్ముఁడా! నీ వేయెలుకకొఱ కింతకొండను ద్రవ్వితివో యాయెలుక యిచ్చట లేదు.

అర్జు—(వెలవెలపాటుతో) అదెట్లు?

భీము—దుర్యోధనుఁ డా సైంధవహతకు నొక యాకాశయానమునఁ గూర్చుండఁబెట్టి యచ్చటినుండి పంపివేయ, వాఁడందందు మసలి మసలి, పొద్దుగ్రుంకవచ్చినందున మగిడి యేతెంచి యిప్పుడు మనసైన్యముపై నంబరవీథిం గ్రుమ్మరుచున్నాఁడు.

అర్జు—(నిరుత్సాహముతో) బావా! వింటివా యీ విపరీతము!

కృష్ణు—విపరీతము కాదు-దుష్టశకుని పన్నిన దుస్తంత్రము! ఈవిధముగా మనలను బొరపెట్టి కాలహరణము సేయుతలంపుతో సైంధవుని దాఁచి, యెవనికో సైంధవవేషము వేసి, యీవంకకనిపియుందురు నిజముగ సైంధవుఁ డిచ్చట లేకున్న దుర్యోధనుఁడు నీ బాణాగ్ని కిందఱ నింధనములఁ గావించువాఁడుఁ గాఁడు మఱియు రణరంగమున నుంచి రక్షింపలేకపోయిరను నాక్షేపము వచ్చు నని శంకింపనివాఁడును గాఁడు.

అర్జు—ఈసందేహ మచటి కేఁగి తీర్చుకొనివచ్చుట మంచి దేమో?

కృష్ణు—ఈ కాకదంతపరీక్ష కిప్పు డవకాశమేది? ప్రొద్దువంకఁ జూచితివా

చ. అరుణగభస్తియై తరణి యస్తగిరీంద్రము సేరఁజొచ్చె; భూ
ధర శిఖరాగ్రపాళులకుఁ దారుచు నున్నది యెండ; క్షేత్రకై
తరలిన పక్షులు న్మరలెఁ దత్తఱపాటున గూళ్ళవంక కి
త్తఱి నటువోయి రాఁగలుగు దాఁకను జాలిన వేళ యున్నదే?

అర్జు—అట్లయిన నాలస్య మెందులకు?-కర్తవ్యమేమో నిరూపింపుము.

కృష్ణు—కర్తవ్యమున కేమున్నది?-యాతుట్టపురు గిచ్చటనే యున్నదని నానమ్మకము. కలుగులోనుండి దానిని బయికి రప్పించుటయే కర్తవ్యము. మేఘాస్త్రమున సూర్యునిం గప్పితివేని ప్రొద్దు గ్రుంకిన దనుకొని యతఁడు బయటికి వచ్చితీఱును.

అర్జు—అట్లయిన నదెంతపని? చిన్నన్నా! నీయభిప్రాయ మేమి?

భీము—బావ చెప్పినట్లు చేయుటయే నా యభిప్రాయము.

అర్జు—అట్లయిన నాలస్య మేల-బావా! రథము పోనిమ్ము!

కృష్ణు—(రథమును గురుసేనవంకకు మరల్చును)

భీము—నేను ముం దేఁగి, యచ్చట నడ్డుగా నున్న వేదండతండమును గదాదండమునఁ జెండాడి మీకుఁ గొంత తెఱపి కావించెదను.
(అని రథము డిగ్గి నిష్క్రమించును.)

తెరలో—ఓహో! వాహినీపతులార! చూచుచు నూరకుంటి రేమి?

ఆ. వె. క్షణములోనఁ దంతిసంతతిఁ బొలియించి,
పిడుగు మొత్తినట్లు భీమసేనుఁ
డరదగముల నెల్ల నటునటు లొనరింపఁ
జొచ్చెఁ, గూల్చుఁ డతనిఁ జుట్టుముట్టి!

కృష్ణు—అర్జునా! అర్జునా! యిదే సమయము?—ఎల్లవారిదృష్టులు నిప్పుడు భీమసేనునిపై నున్నవి. నీ వీ సమయమున మేఘాస్త్రము ప్రయోగించి, చీఁకటులం గలిగింపుము.

అర్జు—ఇదిగో! ప్రయోగించుచున్నాఁడను (అని యట్లు చేయును.)

(తెరలో గొప్ప కలకలము.)

కృష్ణు—(జనాంతికముగా) అర్జునా! శాత్రవుల యానంద...ము చూచితివా! నీమేఘాస్త్రము రవిబింబమును గప్పి... (బొద్దుకు)ంకిన దనుకొని వారు కోలాహలము చేయుచు...న్నారు! అదిగో!-యాకంచు తేరుల వెనుక వరాహధ్వజప...ుతో సైంధవునియరదము కానవచ్చుచున్నది! అతఁ డం... యుండును. నీవు వింట బాణము సంధించి లక్ష్య మావంక...న నిలిపి, సిద్ధముగా నుండుము.

ఇద్దఱు—(...త దేకదృష్టితో ముందునకుఁ జూతురు.)

కృష్ణు—(ఆత్రముతో) అర్జునా! అర్జునా!

ఆ. వె. అదుగో! సింధునృపతి—యత్రత్తి పడమటి
చాయ నరయు—నేయు! మేయు! మిపుడ:

అర్జు—సెబాసు! బావా సెబాసు! సర్వజ్ఞబిరుదము నీకే చెల్లును!
ఈతనియునికిపట్ల నేను సందేహముతోనే యుంటిని! సరికాని—
శస్త్రహీను నతనిఁ జంపుటకై నాదు
చేతు లాడ వేమి సేయువాఁడ!

కృష్ణు—(విసువుతో) అబ్బబ్బా! మీ ధర్మలోభమునకు మేర లేదు కదా! (పరికించి) సరి యింక నేమి! నీసందియము తీర్చుటకో యన నతఁ డదిగో విల్లెత్తి మనపై విశిఖములం గుప్పుచున్నాఁడు!

అర్జు—ఇదిగో! యిప్పుడు వానిమచ్చ మాపెదచూడుము. (అని శరము సంధించి విడుచును.)

కృష్ణు—సెబాసు! పార్థా! సెబాసు!

ఉ. వేఁగి భవచ్ఛరంబు తెగ నేసి జయద్రథు శీర్షభాగముం
డేగ పులుంగునుంబలె వడిం గొనిపోయెడు మింటికి! కద్దిధా
త్రీగత మైన హాని యగుఁ; దెల్పెద నవ్వలఁ గార్యశేష, మీ
వాఁగక తూపులం బఱపి యాఁపుము మింటనె దాని నేర్పుతోఁ.

అర్జు—(స్మృతితో) అన్నట్లు సుభద్రాదేవి సూచన నేను మఱచియే పోయితిని! ఇదిగో నీవు చెప్పినట్లు చేయుచున్నాఁడను. (అని మీఁదికి బాణములు విడుచుచు) పయిసంగతి చెప్పుము.

కృష్ణు—మేఘాస్త్రము వారించి, పాశుపతమునఁ దచ్ఛిరము సింధురాజుతండ్రి యంకతలంబునం బడునట్లు చేయుము.

అర్జు—రెండు కార్యములును నేకకాలమునందే కాఁగలవు. (అని రెండు బాణములను సంధించి ధ్యానము నభినయించి విడుచును)

కృష్ణు—విజయా! యిప్పుడు నీవు సాధిత ప్రతిజ్ఞుండ వై, సఫల మనోరథుండ వైతివి! ఇఁక స్థిమితపడి శత్రువుల కళేబరము విలోకింపుము.

అర్జు—మా చిన్నన్న సంతోషము చూడ వేమి?

గీ. ఛేదితం బైన సైంధవు శిరము చూచి,
పొదలుచు న్వాఁడియుం దోఁచు పొద్దు చూచి,
యుబ్బి గొబ్బున నొక పెనుబొబ్బ వైచి
వచ్చుచున్నాఁడు సంతోషవార్ధి భంగి!

భీము—(సంతోషముతోఁ బ్రవేశించి) తమ్ముఁడా! కృతకృత్యుఁడ వై కులమునకు వన్నె తెచ్చిన నిన్నుఁ జూచి గర్వపడుచున్నాఁడను. బావా! యీచలువ యంతయు నీది! నేను ముందు పోయి అన్నగారికి విజయవార్త నివేదించెదను. (అని నిష్క్రమించును.)

కృష్ణు—మనసుమాత్రము తడయ నేల? (రథము మరల్చి నడపుచు) అదుగో! పెద్దబావగారు సంతోష పారవశ్యముచేత భీమునితోఁ గూడ కాముడ యుడుగుగఁ గాలినడకనె మన కెదురు వచ్చుచున్నారు. మన మిఁక రథము దిగి యాయనను గలిసికొందము.

ఇద్దఱు—(రథము దిగుదురు.)

యుధి—(భీమునితోఁ బ్రవేశించి కృష్ణుని గౌఁగిలించుకొని) వాసుదేవా!

గీ. పగఱ తుదఁ దంతుగూడ నిష్ఫల మొనర్చి
విజయు ప్రతినము నెగ్గించి, విజయు మొదవఁ
జేసిన మహాత్మ నిన్ను నర్చింపనిమ్ము
ప్రథమమున నాదు సంతోష బాష్పములను.

అర్జు—అన్నగారు! విజయుఁడు నమస్కరించుచున్నాఁడు.

యుధి—(కౌఁగిలించుకొని) తండ్రీ! నిర్వర్తితప్రతిజ్ఞుండవై నిరుపద్రవముగ వచ్చి నాకుఁ గన్నులపండువ సలిపితివి!

భీము—అహో! అదే మదేమి! ఘటోత్కచుఁడు రక్తసిక్తాంబరుఁడై కపాలపాణివలె నెవనిదో మస్తకము చేతఁ బట్టుకొని యంబరమునుండి దిగుచున్నాఁడు!

అందఱు—(తొట్రుపాటుతోఁ బరికింతురు)

ఘటో—(ఉక్తప్రకారముగఁ బ్రవేశించి) తండ్రులారా! సైంధవ రూపధారియై మిమ్ములను వ్యాకులపఱిచిన యలంబసునిరక్తముచే దడిసిన కేలుదోయితో మీకుమారుఁడు నమస్కరించుచున్నాడు. (నమస్కరించి) ఇదె యాదుష్టుని మస్తకము. (అని మస్తకము క్రిందఁ బడవైచుచుఁ బ్రక్కకుఁ జూచి) ఇదుగో! మామగారును నిక్కడనే యున్నవారా! (అని కృష్ణునకు నమస్కరించును.)

యుధి—ఏమీ! యా మాయకాఁడలంబసుఁడా! బిడ్డా! యాపాపాత్మునకుఁ దగినశిక్ష కావించితివి!

కృష్ణు—వత్సా! నీతండ్రి లోకకంటకుఁడగు బకుం జంప—నీవు వాని యనుజుం జంపి యాతండ్రికిఁ దగిన కొమరుఁడ వనిపించుకొన్నాఁడవు! బావగారు! ఇక్కడికి విజయుని ప్రతిజ్ఞ నెఱవేఱినది.

ఈ సైంధవవధకుఁ బ్రిథమ ప్రేరకురాలు మాచెల్లెలు. కావున సంతోషవార్త యామె కెఱిఁగించుటకై శీఘ్రముగాఁ బోవలసి యున్నది. ఇఁక నేను జేయవలసిన దేమైన యున్నచో సెలవిండు.

యుధి—ఇంకను నాకుఁ జేయవలసిన దేమున్నది! ఈయనుగ్రహము నా మాతృభూమియెడ వినియోగింపుము.

కృష్ణ—అట్లయిన, నిదిగో!—

సీ. అన్నదమ్ముల భాగ మపహరించెడుబుద్ధి
యుర్వి నెవరికిఁ బుట్టకుండుఁ గాక!
గాండీవి కెనవచ్చు కార్యశూరులతోడ
నిఖిలమండలములు నిండుఁ గాక!
అధికాయురోపేతు లౌనభిమన్యు లిం
టింట నెల్లప్పు డుదయింత్రు గాక!
కాంత లెల్లరు వృద్ధగతాహిమాత లై
గౌరవకీర్తులఁ గాంత్రు గాక!
ప్రజలయం దైకమత్యము ప్రబలుఁ గాక!
విద్యకే గౌరవంబు లభించుఁ గాక!
కవుల వాక్కులకు సిద్ధి కలుగుఁ గాక!
భరతమాత సుఖస్థితిఁ బరఁగుఁ గాక!

శ్రీమజ్జగద్గురు శంకరభగవత్పాద ప్రసాదాసాదిత మహాకవిబిరుదాంక
భారద్వాజ గోత్రార్ణవ శశాంక, కవిఘంటా కలాప హస్త
కాళ్ళకూర్యన్వయప్రశస్త, బంగారురాజ కవిరాజ
తనూజ, నారాయణరాయామాత్యబిడౌజ,
ప్రణీతంబగు పద్మవ్యూహనాటకము
సంపూర్ణము.

